ప్రథమ ముద్రణము—విజయ : శ్రావణము
సర్వస్వామ్యములు గ్రంథకర్తవి.
వెల : ప్రతి 1 కి రు. 1-4-0.
ప్రతులకు :—"ఉదయరంజని" పబ్లిషర్సు, మదరాసు-7.

---

## ఈ గ్రంథకర్త—ఇతర కృతులు

| | | |
|---|---|---|
| కుందమాల (దిఙ్నాగకవి నాటకమున కనువాదము మదరాసు—ఆంధ్ర—మైసూరు విశ్వవిద్యాలయ పట్టపరీక్షలకు పాఠ్యగ్రంథము) .... | రు. | 2-0-0 |
| సుభాషిత రత్నమాల (పద్య) .... | ,, | 0-6-0 |
| శ్రీ రామ—లక్ష్మ స్వభావము (పద్య) ... | ,, | 0-6-0 |
| ఆంధ్ర పాండవగీతలు (పద్య) .... | ,, | 0-6-0 |
| భామినీవిలాసము (పండితరాజ జగన్నాథకృత కనువాదము: శ్లోక సహితము) .... | ,, | 3-0-0 |
| ధర్మ విమర్శనము (గద్యము) .... | ,, | 1-0-0 |
| భక్తకల్ప శతకము (సీసములు) .... | ,, | 0-8-0 |
| శిష్యనీతి బోధినీ శతకము (కందములు) ... | ,, | 0-3-0 |
| భక్తవత్సల శతకము (ఏకప్రాస చంపకములు) | ,, | 0-5-0 |
| తేనె సోనలు (సాంఘిక, రాజకీయ, భక్తి, శృంగారాదిక చాటు పద్యగేయములు) సంపుటము : 1 | ,, | 1-4-0 |
| తేనె సోనలు (ఖండకావ్యములు) సంపుటము : 2 | ,, | 1-1-0 |
| తేనె సోనలు—సంపుటము : 3 .... | ,, | 1-1-0 |

## అచ్చులోనున్న గ్రంథములు

విష్ణుమహామాయావిలాసము (పద్యములు)
మహేశమాల (సంస్కృత శ్లోకములు)
పద్మప్రాభృతకము (శూద్రకకవి భాణమున కనువాదము)
నెహ్రూ కావ్యము (పద్యములు)
శతకవాఙ్మయము (మొదటి సంపుటము)

---

సవరణ :—ఉపహారము 2 పుట 1 పద్యం (జరసుడనైన నాసతిగ).
81 పుట 3వ పంక్తి :—(నందనావ్యాజమున)—అని చదువుడు.

# తేనె సోనలు

(తృతీయ మధుకోశము)

ఆవు మీఁగడపాలు, హిమాంబువులును
గండ చక్కెర, చెఱకుఁ దా, ఎండుద్రాక్ష
స్వాదు మధు వేలకుల్ చేరు పానకమ్ము
చవిఁ గనినవారి లీకృతి చవిని గండ్రు ॥

గ్రంథకర్త :

విద్వత్కవి భూషణ—

విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మ

# ఒక మాట

ఈ 'తృతీయసుధాకోశము'—తో—"తేనెసోన" లిప్పటికి సమాప్తములు. నే కనినవానిలోఁ గొన్ని—ఆయాపత్రికలలోఁ బ్రకటితములయినవి వ్యస్త్యములు. మఱికొన్ని అనుపలక్షణికాములవలన నష్టములు. ఉదాహరణముగ:—'విపద్స్వాజము' (ఏదోయొక "ప్రారంభవిద్యా" వార్షికసంచిక) —(చిత్తరంజనవాహినీవ్యాఖ్యానము' — (ఏదోయొక భారతీసంచిక) ఇట్టివి పెక్కులు. ఆయాపత్రికలవారు అనుగ్రహించిననే తప్ప—అవి లభింపఁగల వను నాసలేదు, చూచుకొందము.

ఈ సంపుటములోని పద్యములలోఁ జాలవఱకు స్వీయచరిత్రకు సంబంధించినవి. అట్టివే యే సందర్భములలోఁ జెప్పఁబడినవో—సంగ్రహముగ—ఆయాచోటులలోఁ దెలిపితిని. కొన్ని పట్టులలో నాయీషణాభూషణము లకుఁ గొందఱు గుఱియైయుండవచ్చును. ఉద్రేకముతోఁ గవులు నోడుపు పద్యములను దమకన్వయింపఁజేసికొను "గుమ్మడికాయలదొంగల"—యను మానములకు వారు బాధ్యత వహింపఁజాలరు.

నాయిలువేల్పు నానతిఁ దలఁదాల్చి "ద్వితీయసుధాకోశ" మును లోఁగడ, విద్వాన్ శ్రీ మంకాల శ్రీపతిశాస్త్రిగారికిఁ గృతియొనర్చితి. ఈ భాగమును—మన్మిత్రులు విద్వాన్ శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రి గారికిఁ బూజ్యభావముతో సమర్పించుకొనుచున్నాఁడను. నేను నాయుడు పేటలో మిషనెరీలయొద్ద నుద్యోగము సేయుచున్నప్పటినుండి (అనఁగా దాదాపు ముప్పదేండ్లనుండి) నాకు వారితో నేస్తముగుదిరి, నిరంతరాయముగ నింతవఱకుఁ బెంపొందుచున్నది. వ్యక్తిగతముగ భిన్నులమయ్యు, నెంత స్వల్పములయినను వ్యవహారములయెడమాత్రము మేమిరువురమభిన్నులము. కేవలము డబ్బు కక్కుఱితితో శ్వవృత్తినవలంబించి, యదియే తమజీవితపర మావధిగఁ దలంచుపండితమ్మన్యులవలెఁగాక, శ్రీ శాస్త్రిగారు నిరంతర సారస్వత సేవయే తమ జన్మసాఫల్యముగ నెంచి, (యుద్యోగవిరామదశకు వచ్చినను) అవిరామముగఁ గృషియొనర్చుటెంతయు శ్లాఘ్యము. శ్రీసతి—శ్రీ శాస్త్రిగారికి ఆయురారోగ్య జవసత్త్వాదులొసంగి సంరక్షించుఁగాక !

మద్రాసు : చూళ<br>విజయ—శ్రావణి

ఇట్లు :—భాషాజీవి—<br>వేదము వేంకటకృష్ణశర్మ.

# ఉపహారము

వరతపస్వి కౌశికగోత్రు లెవ్వరిమును,
పరమవేదాన్వవాయుల మిరువురిమును,
చిఱుతలకుఁ దెల్గు విద్వాంసులిరువురిమును
ద్రావిడాంధ్రపు నేర్మిట్లో దాఁపురించె ||

నెయ్యము నేఁటిదా ? మనమునిన్నటిదా ? నచియింపు, మప్పుడేం
ప్లయ్యెఁగదా, పరస్పరహృదంతరనిష్ఠిత దివ్యభావముల్
దయ్యెక నిప్పిచెప్పికొనుట, వ్యాచికిత్సలఁదీర్చికొంటలుం
నెయ్యములామకొంటెసఁగ నేగనివాసనమున్నె మిత్రమా ||

జ్యోతిషమునందు, వ్యాకరణ శాస్త్రమునం, గణితంబునన్, లసత్
శ్రౌతవిధానమం, దుపనిషత్తుల, నైహికధర్మనీతి వి
ద్యాతిశయంబునందు, ద్రవిడాంధ్ర మహాంగ్లసుపద్యభాషలం
జాతత కావ్యనాటకములం, దసమానుఁడ వీవుమిత్రమా ||

లీలావతిని నవలీల వెల్వఱచుట చాలునీగణితప్రశస్తిఁజాట,
విద్యార్థి నివహంబు విజ్ఞులసలుపుట చాలునీబోధనశక్తిఁజాట,
ఆర్యధర్మములపై వ్యాసముల్ వ్రాయుట చాలునీగ్రంథవిజ్ఞతనుజాట
ప్రాచీనలక్షణ గ్రంథసంస్కరణముల్ చాలునీశాబ్దదక్షతనుజాట,
పలువిధములైన పలుకులపోలుపు మెలపుఁ
దెలుఁగు వావిళ్లపదకోశసృష్టియొండె
చాలునీదువిశాలయశమ్ముఁజాట,
సకుఁడ, లక్ష్మీనారాయణ శాస్త్రివర్య !||

తేనెలు జాలువాఱు కడుఁగమ్మనిపల్కుల కావ్యకన్యకం
దీనిఁ, ద్రుతిన్ముఁ, జేకొనుచ్వితీయఁగఁ ప్రొద్దులు పుచ్చునేర్పు, నెం
తేనివిరామమొందినపుడేవొ కబుర్లువచింపు చాత్మక
ప్లావతఁగూర్చుఁ, గోరఁదగు మార్గము దే, మనకింక మిత్రమా ||

సరియగు కాంతుఁ గూర్ప, కిటుఁ జవ్వని జల్పములాడు త్వత్సుతన్
జరఠుఁడనైన నాకిటుల్ సతిగ సల్పిన, వేఁగుట కష్టమంచెదన్
వెఱతువొ యేమొ, పిల్లపయిఁ బిల్లను నిచ్చు వివేకహీనుఁడం
చేయకు, నిన్నపత్నికను గృహస్థునొనర్చు హితుండ మిత్రమా ||

ప్రేలుదుఁ గొట్టఁ బడుముఁ బెండ్లాల మున్న
ముదుసలులు గొంటను బురాణములను వినవె ?
పలుకుల వెలందిఁ దాత చేపట్టలేదె ?
నలువ యతఁడగుఁ గాక, నీతులయె హితుఁడ !||

చతురాస్యుఁడగుట వదరెదు సతి విద్యల గెలుచుట తఁడసాధ్యమె ? నీవ
ప్రతిముఁడ వానన మొకటనె కృతికన్యం గెలిచియేలు శేషునము సఖా ||

గోలగోలనె ? జంకెలకోనఁగఁ ? గోనఁగ
దోయి, దోయిట నిడిన నాదుహిత, సుహిత
పరులఁ బరులను గోరదీ చెలువచెలువ
మింపు నింపు మదిన్వేగ మేలు, మేలు !||

బుఱ్ఱలు వెంచకుండఁ దమ బొఱ్ఱలు నింప దరిద్రరక్తముల్
జుఱ్ఱఁగఁ బిండు క్రూరులగు లుబ్ధులఁ జేర, రసజ్ఞులం, చయో
వెఱ్ఱికవుల్ మనోరథము వేఁడిన నిత్తురొ, చత్తురో, కడున్
మొఱ్ఱలకిచ్చు కన్న, బుధముఖ్యులకిచ్చుటె కీర్తిదంగున్ ||

జబరజంగికిని ఫిరంగి సంభవించు
పగిది, బహుకావ్యనాటక ప్రజ్ఞఁగల్గు
సద్బుధుఁడు వేంకటాచలశాస్త్రిగారి
వరసుతుండవు, నీకేమి భ్రాంతి సఖుఁడ !

మాడలు, మేడలుం గనకమండనముల్ ధనధాన్యసంపదల్
ప్రౌఢతనంపుభామలును భూములుఁ దోఁటలు పల్లకుల్ సదా
పాడియొసంగు ధేనువులు బంధురగంధగజేంద్ర సైంధవా
ళీడితవృత్తి నీఁగలనె ? యీకృతిఁ గాన్కఁగ నిత్తు మిత్రమా !||

# ఉపశ్రుతి

స్వీయముగ గ్రంథరచన మొనర్చుట యొకయెత్తు; ఒరులు రచించిన దానిం గూర్చి పరిచయవాక్యములు వ్రాయుట మఱియొకయెత్తు. అందును గ్రంథరచయిత పాఠకమహాశయులకు సుపరిచితుఁడగుచో, నాకార్యము మఱింత క్లిష్టమగును. ఈ గ్రంథవిషయమునను నంతియ. 'తేనెసోనల గురిసి, చదువరుల నూరించుచున్న—విద్వాన్, విద్వత్కవిభూషణ—శ్రీ వేదము వేంకటకృష్ణ శర్మగారిని—వారి కృతులను, పరిచయవాక్యములచే, ఆంధ్రలోకమునకుఁ జాటఁబూనుట—'సూర్యునకు దీపపుహారతి యిచ్చుట' వంటిది. అయినను చిరకాలమిత్రుల యానతిఁ ద్రోసిపుచ్చఁజాలకయు,—ఈ భాగము వారిచరిత్రమునకు సంబంధించినదగుటయు నే నీయుపశ్రుతిఁ బలుక నీయకొంటిని.

ఇంతకుఁబూర్వము ముద్రణభాగ్యమందిన—వీరి ప్రథమ ద్వితీయ మధుకోశములలోని 'తేనెసోనలు'—పదముల జిగిబిగి కూర్పు, శయ్యాలాలిత్యము, భావగాంభీర్యము, నిరర్గళగంగాప్రవాహమువంటిధార, శైలిసొంపు గలిగి, రసికజన హృదయరంజకములై—యలరారుట—అనుభవైకవేద్యమే. ఈ తృతీయ మధుకోశమందలి "సోనలు" కవిగారిస్వీయ చరిత్రములోని ప్రధానఘట్టములు. ఇందలి పద్యములలోను బూర్వోక్త గుణములన్నియుఁ బ్రకాశించుచున్నవి. ఆబాల్యము—కవిలోక సహజ కష్టపరంపరల కగ్గమయ్యు—నెట్టెటో యట్టిగండములు గడచి, బయటపడి యుత్తమకృతిరచనములచేఁ దనకవితాఖ్యాతిని స్థిరీకరించుకొన్నాఁ రీకవికులాలంకారులు.

శ్రీశర్మగారి జన్మస్థలము చిత్తూరు మండలము. వారిపూర్వులు కార్వేటినగరసంస్థానమునఁ బేరుగడించి రాజాదరణమందిన మహనీయులు; పండిత ప్రకాండులు. అయినను పండితమండలికి సంభవించుదుర్దశ వీరిని సయితము విడిచినది కాదు. కనుక, వీరు స్వదేశవృత్తులకు స్వస్తిచెప్పి, కోడూరు—నాయుడుపేట—మున్నగు స్థలములలో విదేశీయులగు మిషనరీల ప్రాపకమునకుఁ బాత్రులు గాఁదగుస్థితి తటస్థించినది. అదియు—1930 వ—సం॥ర ప్రాంతమున నూఁడిపోఁగా, పెక్కు సంకటములకు లోనయి, తమ కులదైవమగు శ్రీవేంకటేశ్వరుని సంబోధించుచుఁ జెప్పిన పద్యములలో వారు వాపోయిన విధమును జదువుచో నెవరికి గుండె నిబ్బరముగ నుండఁగలదు? బంధుగులనిరసనభావము—దైవదస్సానమునకుఁ దమకు శక్తిలేమి,—తిరుపతి గొల్లి

తిప్పలు పెట్టి, మూఁడుచెఱువులనీరు త్రావించి, న్యాయస్థానములకు సయితము లాఁగిరి.

కోడూరుపురమున 1939 వ—సం॥మున శ్రీ సుగాసి గురవయ్య గారను మిత్రులు నివేశస్థలము నుచితముగ నొసంగ గృహనిర్మాణమునకుఁ బూనుకొనిరి. అట్టియెడ నావశ్యకమగు ధనాదికము నీకవిగారికి ఋణమొసంగఁ గొందఱుమిత్రులును శిష్యులును వాగ్దత్తమొనర్చియుఁ దుదకు మొండి చేయి చూపిరి. అట్టియెడఁ గవిగారు రచించిన పద్యములు తప్పక చదువఁ దగినవి. అందలి కడపటి దీక్రింది పద్యము :—

" ఎప్పుడో? దుర్గ్లవ దుర్విదగ్ధ జన మా
త్త్రైక ప్రసేవానుగా
ప పురాకృద్ఘనపాపసంచయ మహో
వారాశి మగ్నాస్మదీ
య పరిక్షీణ మనోవిముక్తికర భా
గ్యప్రాప్తి, నాకింక, హా!
యెప్పుడో? యెప్పుడో? యెప్పుడో? గద! రమా
హృత్పద్మపుష్పంధయా! "

ఇరువదిరెండేండ్లు సాంసారికజీవనము గడపియు, అపత్యభాగ్యహీనతచే వీరికి గలిగినవంత—1945 వ—సం॥మున నుద్భవమందిన పుత్త్రికవలనఁ దొలఁగినపుడు లభించిన సంతసము వర్ణనాతీతము. అట్టియానందము కేవల మనుభవైకవేద్యము.

ఒకప్పుడు వీరికెడమచేయి పయికెత్తుటకు వీలుకాని కీళ్లవాత సంబంధ రుజ బాధసూపినది. అట్టిసమయముననే—మూరుమార్కెట్టు సమీపమున ఏఁబదిరూప్యము లున్న డబ్బుసంచి అపహరింపఁబడుటయుఁ, దమకడఁ బెరుఁగుచుండిన తమతమ్ముని మగనిసుంగు—వంశమునకేకసూనుండు మరణించుటయు,—ఊదగిసూల ప్రకోపించుటయు,—వెంటవెంటనే సంభవించినవి. "గోరుచుట్టుపై రోఁకటిపోటు"—ల వంటి యాయిదుములు కల్గ నోర్చుకొని ప్రశాంత స్వభావముతో భగవంతునిపై భారమునైచి, కర్మఫల మనుభవింపక తీరదను నార్యోక్తి యెడ దృఢవిశ్వాసము—గలిగియుండుట ఈపద్యము వలనఁ దెలియనగును :—

“ స్థానభ్రంశము, ద్రవ్యనాశము మన
స్తాపంబు, సతీసోదరీ
ప్రాణాంతంబు, శరీరదారుణరుజా
భారంబు, స్వార్థవ్యయం
బూనంజాలని యప్పు, లేవడియు, ను
ద్యోగాస్థిరత్వంబు, నిం
తేనా ? — యింకను నేమొసంగి, ప్రసుముల్
దీయంగదే, శ్రీపతీ ! ”

ఎట్టి కష్టములు—ఆపదలు—సంకటములు వాటిల్లినను, అనావిల మహార్ణవమువలెం గలంతనొందని చిత్తవృత్తి వీరిది. కావుననే—అట్టి సమయములలోం గూడం దమ సహజకవితాధోరణితోం బద్యముల మూలముగం దమహృదయావేదనమును వెలువరించిరి. అవి భావికాలమునం గవి చరిత్రకారుల కెంతేని యుపకరింపం గలవు.

శ్రీ శర్మగారి పద్యములలో భావగోపన మెక్కుడను గనంబడదు. డొంకతిరుగుడు అన్వయము మందునకైన గానరాదు. ఏ విషయమునుగూర్చిగాని—సుస్పష్టముగ—సూటిగ—సులభశబ్దములతోం జెప్పుదురు. దేశాభిమానము వీరికి ఉగ్గుంబాలతో నభ్యస్తము. వీరు సంస్కృతభాషలోను అపార పాండిత్య మార్జించిరి. ఆంగ్లమున మంచిప్రవేశము గలవారు. వీరి కవిత్వము ఉత్తమశ్రేణికిం జేరందగినది. అందులకుం బలువిషయములంగూర్చిన “తేనెసోనల”లోని రచనలే ప్రబలసాక్ష్యములు. వీరి కృతులు పండితపామరుల కిరుదెగలవారికిని సులభగ్రాహ్యములు. మనోరంజకములు. ‘పాపశంక’—‘జీవితనౌక’—‘విన్నపము’—‘వేడికోలు’—అను పద్యములు జదివిన,—వీరికి సనాతనధర్మమునం దెంత గాఢానురక్తి గలదో విశదమగును.

ఈకవిసత్తమునికి చిరాయురారోగ్యభాగ్యము లొసంగి, భగవంతుం డింకను వీరిచే భాషాసేవ నితోధికముగం జేయించుంగాక ! యని ప్రార్థింతును.

విజయ, జ్యేష్ఠశు పూర్ణిమ
స్థిరవాసరము.
మదరాసు.

ఇట్లు—
వేదము లక్ష్మీనారాయణశాస్త్రి

# విషయావళి

# శ్రీ వేంకటేశ్వర

(1—20 పద్యములు 1930 సం॥ అంతమున నాకుండిన
సర్కారువారి యుద్యోగమూడి, కష్టపడుచునపుడు వ్రాసినవి.)

శ్రీమద్వేంకటశైల మందిర! జగత్
క్షేమంకరా! నిర్జర
స్తోమస్తుత్యకలంక కీర్తి భర! యు
ద్యోతప్రభాపూర! యు
ద్ధామాహంకృత దైత్యలోకహర! ప
ద్మాచిత్తసంచార! హే
స్వామీ! భారము నీదెసుమ్మి, ననుఁ బ్రో
వన్, దుఃఖభాగుం గృపన్ ॥

ధనమల్ గల్గఁగనీక, పేరిమిని న
న్నిన్నాళ్లుఁ గాపాడి, తె
ప్పున నాయండ మెలంగు, చట్టిదియు నే
మోపిడి నేఁడీవు నా
కెడమైపోయి, శ్రమల్గడుం గుడుపు, చి
ట్లీక్షింప నాయంబె?, నా
కొడయం డీవ యటంచు నమ్మితిని నా
మొర్ర సాఁకిని చేసెదదే? ॥

కలుము ల్గలిననాఁడె బంధుగులు వే
డ్కూరఁ 'రమ్మర'మ్మందు, రా
నల "వాఁడెవ్వఁడో ?, 'మేమదెవ్వరము ?' యను
ప్రౌఢ్బ్యయితోనేల ? పల్
పలుకుల్ మా"కని యీసడింతురె కదా.
వార ల్త్వైతల్వాపి నా
కలిమింగూర్తు రటంట కల్లగడ, స్వా
మీ! దిక్కు నీవేగదా ! ॥

'స్వామీ, కొండలనేకికిం గడచి యె
ట్లేశక్తి హీనుండను రాఁ
గామించున్నను జేరఁగా'—నని మది
గాఢంబుగానెంచి, స
న్నేమ న్మానితి, మార్గంబయితి, చే
యొక్కుమ్మడి న్వీడి, తే
నేనుండున్నిను, వజ్రమా మనము ? నీ
కేలా యుపేక్షల్ ప్రభూ ? ॥

కొండం గాఁపురముంట, వ్యాధకులముల్
గొల్వన్ సెబాసంట, బల్
కంపమ్మెక్కుడు మ్లేచ్ఛజాతి గటితం
గామించి, కైకొంట, నీ
దండంజేరినవారి నెత్తి గొలుగం
దార్కొంట, నేఁగాంచి, నీ
కుండంబోలదు మెత్తనౌ మనసుటం
చూపింతుఁ జిత్తంబునన్ ॥

'పదులు నూఱులు వేలు లక్షలుగ స
ద్భక్తుల్ సదా తెచ్చి యి
చ్చెద, రా ద్రవ్యము నెవ్వరే నడుగ దా
క్షిణ్యంబుమై నీయఁగా
నది యేలా?— యని యేడుగొండలను నీ
వా ప్రక్కఁ దోఁబూఁచివై
యెదుగంబోవుదె? దాఁగియుండుదువె? నీ
యున్కిం గవుల్ దెల్పరే? ॥ ౬

సరసాన్నంబులు, బిండివంటలును వి
స్తారంబుగాఁ జేసి, నీ
సరసం బెట్టి, శ్రుతిప్రపాఠములతో
సద్వైష్ణవు ల్వేఁడ సం
బరమారన్ భుజియించి, పద్మ పదః
ద్మద్వంద్వముం బట్టి, ని
ద్దురఁ గొంటల్గద నిత్యచర్య, ప్రభు! నా
దుఃఖంబు లెప్డెంతువో? ॥ ౭

జగముం దోఁచి సుఖించు దొడ్డ దొంగ
వో స్వామీ! కృపాస్వాంత మీ
యగతి ప్రాపకుఁడై నెటుల్గలుగు, నీ,
కల్లాటకున్, మత్కృతం
బగుదోషంబె కతంబు. నిర్దయవనే
లా? దేవ, ప్రారబ్ధ మా
భగవంతున్ విధినైన పీడదిఁక నీ
ప్రాపంచిక ల్లెక్కయే? ॥ ౮

కలుషము ల్గల్గిననాఁడె బంధుగులు వే
ఱ్ఱక్ 'రమ్మర'మ్మందు, రా
నిల ''వాఁడెవ్వాఁడో ?, 'మేమదెవ్వరము ?' ప్ర
ప్రాఁడ్బ్యాయితో నేల ? సల్
పిలుకుల్ మా''కని యీసడింతురె కదా.
వార ల్త్యేతల్యాప్తి నా
శెలమింగూర్తి రటంట కల్లగద, స్వా
మీ! దిక్కు నీవేగదా! ॥

'ఏమీ. కొండలనేకీటి గహచి యు
ల్లేశ క్తి హీనుండు రాఁ
నామెంచున్నను జేరఁగా' —నవి మది
గాఢంబుగా నెంచి, స
న్న్నము న్మానితి, మార్గంబయితి. చే
యొక్కమ్మడి స్వీడి, తే
నేనుందున్నిను, వజ్రమా మనము ? నీ
కేలా యుపేక్షల్ ప్రభూ ?॥

కొండం గాఁపురముంట, వ్యాధకులముల
గోల్వక్ సెబాసంట, బల్
కంపత్మకేడు మ్లేచ్ఛజాతి గతీతం
గామించి, కైకొంట, నీ
పంహంజేరినవారి నెత్తి గొఱుగం
దార్కొంట, నేఁగాంచి, నీ
మంశంబోలదు మెత్తనౌ మనసుటం
చూహింతుఁ జిత్తంబునన్ ॥

పదులు నూర్లు వేలు లక్షలుగ స
ద్భక్తుల్ సదా తెచ్చి యి
చ్చెద, రా ద్రవ్యము నెవ్వరే నడుగ సా
క్షిణ్యంబుమై నీయఁగా
నది యేలా ? — యని యేడుగొండలకు నీ
వా ప్రక్క దోఁబూఁచి వై
చెముదగంబోవ్వదే ? దాఁగియుండుదు వె ? నీ
యున్కిం గవుల్ చెల్పరే ?॥ ౬

సరసాన్నంబులు, బిండివంటలును వి
స్తారంబుగాఁ జేసి, నీ
సరసం బెట్టి, శ్రుతిప్రపాఠములతో
సద్వైష్ణవు ల్వేఁడ సం
బరమారన్ భుజియించి, పద్మ పద
ద్మద్వంద్వముం బట్టు, ని
న్నరఁ గొంటల్గద నిత్యచర్య, ప్రభు ! నా
దుఃఖంబు లెప్పెంతువో ?॥ ౭

జగముం దోఁచి సుఖించు దొడ్డ దొర
వో స్వామీ ! కృపాస్వాంత మీ
యగతి ప్రాపకుఁడై నెటుల్గలుగు, నీ,
కల్లాటకున్, మత్కృతం
బగుదోషంబె కతంబు. నిద్దడవనే
లా ? దేవ, ప్రారబ్ధ మా
భగవంతున్ విధినైన వీడదిఁక నీ
ప్రాపంచికు లెక్కయే ?॥ ౮

'గోవిందా'— యని భక్తి తత్పరత నే
నొంతె త్తి పిల్వం, దయా
శ్వాసం బొప్పంగ వీక్షణంబులిటు ప్రా
ప్పంగ రాదె నాపైకి?, నా
సేవల్ స్వీకొనరాదె?, నా కలుషముల్
చెండాడఁగా రాదె?, నా
కేవేఁ గోర్కెల నీయ రాదె?, కృపతో
నింకేని శేషాధిపా! ॥ ౯

పసిఁగూన బట్టిన పెల్ల బంగరయి సం
పత్కాలమంద, దల్లె దు
ర్భర దారిద్ర్యపు వేళఁ బట్టినది స
ర్వం బిన్నగా మాఱుఁగా
యని రే! మానవుఁ జిత్రపుం బ్రతిభయా
ట్లాడింతు వేలయ్య? ట
క్కరి యా గారడివానిఁ బోలె నిడి నే
డ్కన్నీకుఁ గావించునే? ౧౦

పదముల్ గావె యదృష్టతా ఫలములై
భాసిల్లు లోకమ్మునన్,
ముదముం, భాగ్యముఁ, ద్యాగభోగ యశమున్
పూజ్యత్వ, మారోగ్యముం
బ్రదుకుం జావును వాసిచే నరునకుం
బ్రాప్తింపఁగాఁ జేసె, దో
సదయా, యెంతటి మాయకాఁడవురా, నీ
చర్యల్ మహాశ్చర్యముల్ ॥ ౧౧

ఏదియు న్నీకృపలేనిచో నగునె?, యు
ల్లేయా నదృష్టంబయో!
కోదండై యున్నపు, డింక నెట్టిగతులం
గూర్పంగ నున్నావొ?, నా
మదికింతే నెఱుఁగంగరాదు, కడు మ
ర్మంబుల్ భవచ్చర్య, లో
త్రిదశేంద్రాది సురార్చిత ప్రథితమూ
ర్తీ! శేషశైలాధిపా!॥ ౧౨

నేనా? నీదు బిభీషికల్ గని మదిన్
హీనార్థ్యమందుంతు, న
న్నా! నాచిత్తమెఱింగియున్ గలచఁగా
నో దేవ! యేలా? స్వభ
క్తానీకంబు సుఖించుటల్ గనఁగ లే
వా? యింత కార్పణ్యమా?
కానీ నీ చెయిదంబులన్ జెడుటయున్
ఖ్యాతిప్రదంబే యగున్॥ ౧౩

కలికాలంబున లోకరక్షణము సం
కల్పించి శేషాద్రిపై
నెలవుం గల్గితి వంచుఁ బెద్దలనఁగా
వింటిం, భవత్పాదముల్
గొలువం గంటిని, కల్మషంబులను పో
ద్రోలంటిం, భవత్సత్కృపా
లలితాలోకన వృష్టి నుంటిని గదా,
లక్ష్మీశ! రక్షింపవే॥ ౧౪

క్షీణమొందుంగతిగాఁగ మాఱు మదిగ్రా
ల్జాల్మం బ్రసేవింప, ర
క్షణముం గల్గునె? యెరికేని, ఫణిభో
గచ్ఛాయ మండూకమ
గ్గుణమాత్రంబును, సౌఖ్యముం బొరయు,
ప్లాటక్, దయాసాంద్ర! దు
ర్గుణవత్సంగతిఁ బాపి నాకిఁక భవ
ద్రూపంబు జూపంగదే? ॥ ౧౪

పరయుక్తాశే రధికారగర్వ దురితా
హంకార సంఛాదితాం
తర నైజాంచిత మానవ ప్రకృతుల
న్య ప్రాణి హింసాపరుల్
పరమామ్నాయ రహస్య విజ్ఞ జనతా
బాధానుభావంబు, లీ
శ్వర! మాయామయ! నీప్రభావ మిదియా?
చాలయ్య! నీ పక్షముల్ ॥ ౧౫

వలపక్షంబిల నేరికి న్దగునె యె
ప్పాటక్?, మనం బెంతయుఁ
గలుషీభూతముగాదె దాన?, నిఁక న
న్నా! నీక యీలక్షణం
బలరం జెప్పెడిదేమి?, లోకముల హా
హా కారముల్ పుట్టవే?,
వలదు న్వాచ్చనె నిన్ను నమ్మి, వులమే
ల్మంగా మనోనాయకా! ॥ ౧౬

మురుపు త్తెచ్చినఁ, గానుకలిచ్చిన భక
న్మూర్తింగనం బ్రీతిఁ గా
ల్చినక న్వచ్చిన నుత్సవంబులను స
ల్పం జొచ్చినం, గొంచెమే
నెనరున దృష్టి వహింపకేల యిటు నీ
వేఁచం, భవద్భక్తులన్ ?
గడుపుల్ మాడ్చెదవేల ?, కష్టములు ప్రబ
గం జేయ నేలా ? ప్రభూ ! ॥ ౧౮

అడ్డంకెంత గడించినం గుడుచుచో
నై పోవుఁగా, దానికై
స్వర్గశాంతి వహింపఁ బొల్పడితి, నా
ప్రారబ్ధమేమో, రమా
స్వర్గంగూడ ఘటించి కుల్కెదవు, 'సె
బా' సేల నిన్నింక నే
నర్గించు దొరకొంట ? దేవ ! మృదుభా
వా ! వేంకటేశప్రభూ ! ॥ ౧౯

ఒకపు దరిద్రతాదశకుఁ
బొల్పడి, వ్యాధుల బాధల న్నిగం
తగము శ్రమమ్ము నొందు చిటు
నాదగు జీవిత మెన్నినాళ్లిలం
జరుపుదు ?, నింక నేని, నను
సాదరదృష్టిని జూడ నెంచ, కే
యురసుర లేలచేసెదు ? ర
మాధిప, వేంకటశైలమందిరా ! ॥ ౨౦

ల్లాసము మూపి, చిత్రపు వి
లాసములంచును వెట్టివేసముల్
వేసి బజారికిం జేసిరి, క
లిం జడులౌ కుకవుల్ రమాపతీ! ॥ ౨౩

కరమున లేఖినిం గొనిన
గల్లలలాడుచు సమ్ముఖీనయై,
మురువులు సూపుచు న్నవుల
ముచ్చటనించు కవిత్వ కన్య వా
నరమర సేయుచుండె, నిది
యక్కట! నీకును నాకు నెంతయున్
స్థిరమగు సత్ప్రతిష్ఠయని
నీమది నెంచవె? వేంకటేశ్వరా! ॥ ౨౪

అక్షీణంబగు సత్కృపన్మనుచు దే
వాధీశుఁడీవయ్యు, ని
ర్దాక్షిణ్యంబగు చిత్తవృత్తి, నను దు
ర్దాంతాత్మ తాపంబునం
బ్రక్షోభింపఁగఁ జేసెదేల? యిటు దా
రాపుల్ ఘటింపించుటల్
శిక్షల్సల్పుట యంచు నెంచితివా? నీ
చిత్తంబు, శేషాధిపా! ॥ ౨౫

రక్షింపంగల శక్తి యుండియును గ్రూ
రప్రౌఢి శిక్షింప, నా
యక్షయ్యంబగు దోషరాజియె కతం
బౌనంచు నెంతున్ వృథా

కైక్కొనఁ బోరకొందువే? — నుడువుమా?
శీఘ్రుంబ నాదోషముల్
దాక్షిణ్యంబు వహింపనేల? యపరా
ధం బొత్తిచెప్పఁ బ్రభూ! ॥ ౨౬

మంచిగ నేఁడు పల్కుజన
మండలి నోళ్ళతో రేపు చెడ్డదను
పెంచి, వచించునేమో, కల
విన్నియు లేనివియున్న, యిట్టి ...
వంచకులాడు సుద్దమును
బద్దములేని యనాత్మజల్పముల్
గొంచక నీవెడఁద సయిపఁ
గూడునె? తిర్పతి వేంకటేశ్వరా! ॥ ౨౭

(1931 సం॥ కడపట ఉదరశూల అతిశయింపఁ జెప్పనవి ౨౮—౨౯)

కడుపునకింత తిందమనఁ
గంటికి నిద్దుర రాదు రాత్రి, హా!
బడలిక వాయఁ గూర్కుఁదలఁ
పన్మదిఁ దింకియు లేదుగా! పోయిఁ
విడదొక ప్రాణమే, యుదర
వేదన నోర్చెడు పాటిగా దిఁకల్
సెడియెఁ దనూవిలాస మక
లంక పటుత్వమడంగె శ్రీపతీ! ॥ ౨౮

ఎక్కడిది కడుపునొప్పి? రొమ్మొడ
        లింతగఁ బిప్పియొనర్చి, సౌఖ్యముం
ఊక్కఁగనీక, కష్టమిదు
        ఉల్లని, యూరక వేడ్కసూచె, నీ
చక్కట! — నాపురాకృతము
        పాకలుపంబని యెంచి, నిన్నుఁగక్
నొక్కిన లాభమిల్లయని
        నొప్పి సహించెద, వేంకటేశ్వరా! ॥ ౨౯

(సంసారపుఁదగులాట మెక్కువైనపుడు చెప్పినవి 30—32)

స్వామీ! నామెడఁ గట్టితీవు పలుజం
        జాటంబు, లీ భారముల్
నేమోయం గలనంచు నెంచితివి, కా
        నీ, దుర్బలుండంచు నీ
వేమాత్రంబుఁ దలంపవైతివి దయా
        దృష్టిన్ సహాయుండవై
ప్రేమ న్నాదరి నిల్తువన్న, నదియున్
        వీల్గాదె? పద్మాధిపా! ॥ ౩౦

పచ్చగ నెప్పుడుం బ్రదుకు
        వానిని జూచినఁ బ్రొయ్యిలోసఁ బా
లుచ్చలువోసికొంద్రు, మన
        సొప్పని బందుగు, లంతెకాక, సి

స్వప్నావస్థందు మున్గతమ
వానిని చేరఁగఁదీరు, శ్రీరికిం
గొప్పికనాయివారికి న
భానము భేదము వేంకటేశ్వరా! ॥ ౩౧

పద్దులు పద్దులిచ్చియు వి
పద్దశగూర్చెడు న్యాయవాది. యే
ప్రొద్దునొకండె నల్వురికిఁ
బూటఁగ నిల్వనొసర్చుఁగాల, మీ
పెద్దతికంబునన్ వెతలె
పెట్టెదవీవును, 'నెద్దుపుండెటుల్
ముద్దగుఁగాకి'—కన్నుడి
పూర్తిగనాయెడ నిక్కమో ప్రభూ! ॥ ౩౨

(శరీరాస్వస్థతతో 1934 ప్రాంతమునఁ జెప్పినవి 33—40)

ఆమయపీడనున్న యపు
డాప్తహితావళి, శిష్యవర్గమున్
క్షేమపడై షివారమెటు
నెమ్మదినుండును నాదుకోర్కెఁకన్
నామృతిఁగోరు బందుగులు
నాకెటు లాదుకొనంగ వత్తురం
చే, మది, నిశ్చయించితి, ర
మేశ! యెఱుంగవె దీని నీవెడన్ ॥ ౩౩

నాపయి గంటు వెట్టికొని
నన్దనపొట్టను బెట్టికొందమం
చేఁపునఁ బిడుఁగూర్చు దురి
తేత్వరి మృత్యువుపూన్కి నమ్మగా
ద్రాఁపున నిల్చి ప్రోచితి వు
దారదయారస సాంద్రదృష్టి, నా
పాపదలందుఁ జుట్టమయి
యాదుకొనన్నతి నీవెగా, ప్రభూ ॥ ౩౭

పలువది యేండ్లకే తనువు
నం గడుసీరసభావమేర్పడెఁ
సలిగెను సంధి బంధము, ల
నంతరుజల్ పయిఁగానిపించె, దు
ర్బలతఁ గృశించె నంగములు,
ప్రాణములుం బరునంచుఁదోఁచె, నేఁ
చులకిటు కష్టపెట్టుదువు
దుర్జన శిక్షక! సాధురక్షకా! ॥ ౩౮

పొండికి నిద్రకుం జెడితి,
దేవర వౌ నినుఁగొల్వ మానితిఁ,
బండితగోష్ఠి. వీడితిని,
బాసితి సత్కవితామతల్లికన్,
సంతసముదంబుఁ గోల్పడితి,
నెమ్మది సౌఖ్యములం దొఱంగితిఁ,
కొండలరాయ! మొండిబ్రదు
కుం బ్రదికింతువు, విదేల సన్నిటుల్ ॥ ౩౯

విచ్చెఁ గాఁ సౌఖ్యము, పెచ్చెఁ దాపము, హృదిం
జొచ్చె నహంకారముం
గచ్చెఁ, జుట్టలనిందలెచ్చెఁ బగయుం
దెచ్చెఁ, రుజావర్గముం
గ్రొచ్చెం దేహము, శక్తిచచ్చెఁ బయిపై
చ్చె న్నొచ్చె గాత్రంబయో!
పొచ్చెం బోయితి నీదు దృష్టికిని నె
ట్లో యింకఁ బద్మాపతీ! ॥ ౨౮

సఱచితినా? నినుం దలంప,
మానితినా? భవదంఘ్రిపూజనల్,
సెఱచితినా? త్వదాఖ్య, నిర
సించితినా? యెపుడేని నీకృపన్,
విఱచితినా? భవన్మనము,
ప్రేలితినా? నినుఁ గూర్చి కాఱులన్,
అఱమఱచేసె దేల? యొకో
కప్పుడు నన్నిటు వేంకటేశ్వరా! ॥ ౨౯

తెఱచెద వేల నామనము
దానవదారక, యప్పుడప్పుడున్,
మఱచెద వేల సన్విడిచి
వాసవపాలక, సారె సారెకున్,
నెఱచెద వేల సద్దరియ
విశ్వనియోజక, యంతకంతకున్,
నఱచెద వేల నాకొడవ
మంగళదాయక, వేంకటేశ్వరా! ॥ ౩౦

నలువదిదాఁటె, మైదిట వ
ణంగె, మనోబలమిాఁగె, రోగపీ
డలు మితిమించె, మున్పటిక
డంకనశించె, విచారపాళిచేఁ
గళవళ పాటుహెచ్చె, మతి
కార్శ్యముఁ దాలిచెఁ, దాల్మిపోయె, నే
వల మొక వ్యర్థజీవినయి
వర్తిలుచుంగద, వేంకటేశ్వరా! ౪౦

(అసూయాపరులగు బంధువుల దౌష్ట్యమెూన్నకె చెప్పినవి.)
—1935—36 మధ్య : 41—45 పద్యములు.

సాగెడు వారిఁజూచి, మది
సంతసమందక, కన్నులం బొగల్
రేఁగఁగఁ, దాతగంటు దిగ
ద్రిమింగిన యట్లు దలంచి, యోర్వకే
వాఁగెడి బంధుగుల్ దమని
వాసముఁ జేరఁగనీరు, సాగుఁబా
టాఁగిన యప్డు, వారికిది
యారయ నైజము, వేంకటేశ్వరా! ౪౧

శ్రమపడి తెచ్చుకొన్నపది
రాళ్లను నేఁ దినరాదు, మిత్రన
ప్తములకుఁ బెట్టరాదు, ననుఁ
గాచిన వారికి నీయరాదు, చు

ష్టములకుఁ దక్కు వారికి ని
ండంగ, దంతయుఁ గూర్చి, ముల్లెగాఁ
గమక యొసంగఁగావలయు
ధర్మమె యియ్యది వేంకటేశ్వరా! ॥ ౫.

నా కష్టార్జితమైన భుజియిం
చం జూడలేనట్టి వా
రా, కించిద్విపదాకుల స్థితిని నా
హాయ్యంబు నాకౌదు, నా
యాకాంక్షన్మదిఁ జేర్చలేఁ, దిఁకేసు నా
రా?—నాదు తోడ్పాటు లే
కే కార్యంబుఁ బొనర్చలే, రసహానం
బేలా? రమానాయకా! ॥ ౬

వేదన కిచ్చుచుండిన "బ
లే, మనవాఁడల మంచిత్యాగి" యుం
చాదర ముట్టిరాలఁ గొని
యాడుదు, రించుక లేదట [illegible]మా?,
"యీదగిడీకిఁ గన్నులివె
యెక్కెను నెత్తికి, నాల్గురాళ్లు నం
పాదనచేయు మాత్ర" నని
బందుగులందురు వేంకటేశ్వరా! ౭

కాలముఁ గర్మముం గలిసి
కాసి, యొకానొక దేహధారి, కిఁ
జాలవు మేలో, కీడో, యిది
సత్యము; పల్కెర నేతిదుష్టమై

బాలుఁగ నాశ్రయించి, కవు
ల్శాంతిలుట ల్వైతయం చెప్పింగియుక్
బాలిశులేక, విజ్ఞులె వె
తల్గనుచుందురు వేంకటేశ్వరా! ౪౫

(అప్పుడుజుంగూర్చి 20–11–1937 న వ్రాసినవి 46—47)

అరిషడ్వర్గము గెల్వఁజాలు నెవఁడా
యాత్మోన్నతుండే సుఁడీ
పరమాత్ముం గనఁజాలువాఁడని బుధుల్
పల్మాఱు ఘోషింతు, రా
పరతత్వం దారి యొనర్పకున్న నిఁక సం
సారాంబుధిన్మగ్గు పా
మరులౌ? యట్లు చరించువారి, లలిమే
ల్మంగాంబికా నాయకా! ॥ ౪౬

పాత్రము లేవో నాల్గుకసి,
పూర్తిగఁ దెల్వి లభించినట్లు, దాఁ
జిత్తమునం దలంచి, గుణ
శీలురు పెద్దలు సెప్పు నీతులు
జెత్తలటంచుఁ, దా నొడువు
చెత్తలె నీతులటంచుఁ, బల్కు ను
న్మత్తుఁడు లోకమందు నవ
మానము సెందఁడె వేంకటేశ్వరా! ॥ ౪౭

సాఁకెడి వారి యూఁతయె వె
    సం గిటికీలును దల్పులల్మరల్
చీఁకనిదం త్రైలై యిటువ
    సింప గృహంబొకఁ డేర్పడె. ప్రభూ! ॥ ౫౧

అనవద్యంబగు వైభవాధికతఁ బా
    కారాతి నిర్జించుఁ గా
క ; నవోన్మేషవయః ప్రపూర్ణ సుషమా
    కాంతిన్ స్మరుం గెల్చుఁ గా
క ; నయాచారత మించుఁగాక గుణసిన్ ;
    గాసంత యౌదార్యమే
తెనరం బోని యెడ, న్నరుండు యశో ము
    దంజాలునే? శ్రీపతీ! ॥ ౫౨

ధనవంతుం డయినంతమాత్ర నరుఁడే
    దారిన్ యశంబుంగనున్?
ఘనవిద్యా మహిమావలోకన కళా
    నంద ప్రభోన్మీలితా
త్మ్రనవాంభోరుహ దివ్య గంధలహరీ
    మాధుర్య పర్యాప్తలో
కనికాయుండయి మెల్గఁడేనిఁ గనునా
    కా! శేషశైలాధిపా! ॥ ౫౩

ధనవంతుం డయినంతమాత్రి నరుఁడే
    దారిన్ యశంబుంగనున్
జనసమ్మానిత భవ్యకావ్య రచనా
    చాతుర్య ధుర్యోరువా

స్థపితామందు విశాలకీర్తి లలనా
సంశ్లేష సమ్మోదితో
స్త్రాపక స్మ్రగ్రణీ గోష్ఠిం గోరనియెడం
బద్ధానతి నాయకా! ॥ ౫౩

సనవంతుం డయినంతమాత్ర నరుండే
దారిక యశంబుం గనుక
నీనయోదార దయాక్షమా శమదమా
విద్వేష సంతృప్త స
జ్జన సంప్రీణన దేవతాతిథి సమర్చా
మాతృ పిత్రార్య పూ
జన మిత్రాశ్రిత గౌరవంబు లెద నెం
చండేని, శేషాధిపా ! ॥ ౫౪

నాకర్మబదియేమొ ?, యెల్లరయెడం
దాక్షిణ్యముం జూపు వా
రే, కించిత్కరుణానుతిం గనరు, న
న్నేమందు ? నీచిత్తమె
ట్లో కానిమ్మని యున్నవాండ, భవదీ
యోదార కారుణ్యమే
నాకాంక్షించుచుం, బాలముంచెదవో ? దే
వా! నీటనే ముంచెదో ? ॥ ౫౫

ఊన్నారెందఱో బందుగుల్ హితులు శి
ష్యుల్ద్రవ్యవంతుల్ధలం
సన్నిత్యంబును వడ్డికై ధనము మా .
ర్వారుల్వాలెం ద్రిప్పు వా

(... సత్సంగ వెకమచేయిఁ బయికె త్తరాకుండ బాధనము ... న చెప్పినవి 70—74).

నిస్తుల్యంబగు ధర్మమార్గమున నే
నిర్నిద్రత న్మెల్గఁగన్
... స్తింబెట్టుట న్యాయమా? యుచితమా?
కార్పణ్యమా? వేడుకా?
... స్తత్వత్పద పంకజద్వయము నా
స, న్నమ్మి నన్నేఁచెదే?
... స్త స్తంభన మేలచేసితివి దే
వా! శేషశైలాధిపా!॥

...స్తుల్ భాగవతార్చనల్ సలుప భ
...కిం, జూచి, చూపోపకే,
...స్తంత్రంబున, వానికిం జెడుగు లె...
త్తో గూర్చితిం గావలెన్
...స్తింజేసితి వెట్టికార్యములు నే
సల్పంగ రాకుండ, నీ
... స్త స్తంభ మొనర్చి; దీనిఁగృపఁ ...
యం జేయవా? శ్రీపతీ॥

...చికిఁ బోయినం, జెడుగె
మానక నాకుఁ దటస్థమౌట, ...
... చనచేతనే, యకట!
భావ్యమె? నమ్మినవారి నిట్లు ...

.. చుట, క్రూరబుద్ధివయి,
వేమకయూ యిది ?, నీ, క దేల ..
.. మక యేని సత్కారుణ
యేర్పడఁ జూడవు నన్ను, శ్రీ ..
.. మహిమానలోకన శు
భ ప్రతిపాదిత సత్యవిజ్ఞ ..
సన్మతి సిద్విచారులయి,
సాధులు, తత్త్వపథాను సారు ..
చున్మదమందు తీరున వి
శుంభదనంత భవాబ్ధిదాఁటి. ..
.. య ! నిశ్చలాత్మసుఖ
సిద్ధిని బొందు నదృష్టమెన్న ..
.. వా ? పల్మఱు వేఁడుటల్ నిను ..
భూషాంచితా, యచ్యుతా,
.. వా ? నన్నిఁటు వేఁపనీకు సుజ..
స్తుత్యోదయా, సత్ప్రియా,
.. వా ? నీకొక ప్రాణిఁగాచుట కరి
ప్రాణావనా, పావనా,
క .. వా ? నాకు భవత్కృపామృతము, ..
కాంతాపతీ, సద్గతీ ॥
దీపము నార్పఁబ్రువ్వ, తన
దేహముఁ గాల్చెడు దివ్వెఁ ..
నేఁపున సంచరింతుగతి,
నేనును నాత్మవినాశహేతు, ..

స్త్రీని కుటుంబము న్వెతలఁ
ద్రోచి యడంగుట, గోరుచుట్టుపై
రోఁకటిపోటులట్లు మదిఁ
గ్రుచ్చి, వ్రణంబొనరించె శ్రీసతీ! ॥ ౭౮

స్థానభ్రంశము, ద్రవ్యనాశము, సుసం
తాపంబు, సతోదరీ
ప్రాణాంతంబు, శరీరదారుణరుజా
ఘోరంబు, వ్యర్థవ్యయం
బానంజాలని యప్పు, లేవడియు, ను
ద్యోగాస్థిరత్వంబు, నిం
కేనా?, యింకను నేమొనర్తు, వుసురుల్
దీయంగదే, శ్రీసతీ!॥ ౭౯

*(శ్రీసతి మహాసంగ్రామమునఁ [illegible] చెప్పినవి: 80—84)*

రాజుల్ పూర్వముపోరరే! కలను, ఘో
రాహోరిగా, సైనికుల్
తేజంబొప్ప నరాతులం దునుమరే!
దివ్యాయుధాళిన్, ద్విష
ద్రాజశ్రీల హరింపరే?, శరణనన్
రక్షింపరే? భీరులన్,
రాజాంబయ్యెది, నేటియుద్ధములో, ప్ర
శాచంబులే శ్రీసతీ!॥ ౮౦

[illegible]ధివచ్చి యహో
తాళి విమానములందు, నూళ్లపై
బాంబులు గుండ్లుమొత్తి, జన
పాళి గృహంబులు, ఫ్యాక్టరీలు మొ
త్తంబులుగాఁ బడ, న్నిగుల
దారుణరీతిఁ జరింప, నెట్లు స్వాం
తంబులు సంచరింపక, క
నందగునయ్యా ! రమామనోహరా ! ॥

జర్మనియుం జపా నసమ
చాతురి యాంత్రిక యుద్ధసాధ్యదు
ష్కర్మల మర్మముల్ దెలిసి,
కారుణికత్వము రోసి, దుర్భరా
కర్మసురద్విష న్మతముఁ
దాలిచి, మానవతం ద్యజించి, యో
[illegible]లవాస ! లోకలయ
దీక్షవహింపఁ ద్వదాజ్ఞయో మొకో ? ॥

' పెరతై లెండ్సు ' వినాశమయ్యె ; ' ఫిలిప్పై[illegible] '
ద్వీపంబులుం బాడఱెఁ,
బోరివోయె ' న్మలయా ' ; ' మణీల ' మసిద్యు
భూమింబడెఁ ; ' సింగపూ '
ర్గరిమం బాసె ; ' సుమాత్ర ' గూలె ; బలిష్ఠి
రంబూఁడె ; ' జావా ' నిదే
యరి సైన్యంబులు చుట్టుముట్టె ; లయకా
లాగ్నింబఱెఁ శ్రీపతీ ! ॥

మానితబౌద్ధధర్మమతి
మంతులకెల్లను నాటపట్టు, ల
క్ష్మీశ్రనిలయంబు ; మింటిని స్పృ
శించెడి రాడ్భవనాళికిక్కు, వా
హాణ వినిర్మితార్యమత
శాసనరాజికిఁజోటు - నైన *రం
గూను'న కేర్పడెం, దలఁపఁ
గూడని యాపద లక్కటక్కటా ! ౧౮

(1940 సం॥న విజ్ఞులవర్తనముంగూర్చి చెప్పినవి : ౧౯—౨౦).

*ప్రకృతియె శుద్ధమాయ పరి
వర్తనశీల, యసత్యలోల - యే
లాకో ? యభిమాన, మట్టి చల
యుక్తపయిన్, విడు' - మంచునాత్మబో
ధకు దిగినట్టి పండితులె
తప్పుడుఁద్రోవలఁ బోయి, లోఁగి, కై
పీఁకముల, కింతవంచనము
నెట్లు సహించెదో వేంకటేశ్వరా ! ॥ ౧౯

ఒకనిమిషాన దుఃఖము, మ
ఱొక్క నిమేషమునందు సౌఖ్యముం,
బ్రకట మొనర్చువా, రెటు తి
రంబగు బుద్ధిని గల్గువారో ? యీ

ప్రకృతికి నెట్టులోఁబడని
వారో ?, యెఱుంగఁగరాదు ; చంచలా
త్మకులయినన్ సుధీయుతులె,
మాదృశు లేమిఁక లెక్క ?, శ్రీపతీ ! ॥ ౮౬

(1939 లోఁ—గల మత్పరిస్థితులంగూర్చిన పద్యములు 87—91)

నాగోకు ల్మదిఁ దోఁచినప్పు డెదుటం
ద్వ్యద్రూపముం జూపి, యెం
తేఁ గోర్కుల్ చిగురొత్తఁ జేసెదవు ; కా
నీ, చిత్తశాంతి స్థితిన్
వేగం గూర్పక, జాగొనర్చ్చె, దది యు
న్యోడా ? భవత్కీర్తికిన్
బాగా ? యయ్యాది, యింక నైన నఁ గృపా నన్
బాలింపుమా ? శ్రీపతీ ! ॥ ౮౭

నాయుల్లాసెను నోరు విన్నుతించి బి
గ్గంగాపు కానంచు, నెం
తో యాయాసముమీఱ మొఱ్ఱలిడి, నే
తూపుల్, పరాకా ? వెత
ల్పాయం జేసిన నీదు గంటరుగునా ?
పాషాణ రూపంబటుల్,
నాయుం తేనియు విప్పవింత గరువం
బా ? శేషశైలాధిపా ! ॥ ౮౮

ఇతరుల జీవితంబు వల
దయ్యు విరోధులకేని, దానిచే
నతిశయమైన లంపటయు,
నాకులపాటును, మానహానియుఁ
బ్రతుకుపయిం జిరాకుఁ, బర
భాగ్యనిరీక్షణ, మాత్మఘాతముఁ,
మతి చెడిపోకయుం గలుగు
మాన్యుఁడు వాని సహించునే ప్రభూ! ॥ ౧౯

వలవల నేడ్తునో, చనిన
వారికినై; మఱి యున్నవారికై,
కలకలమంచు నవ్వుదునొ;
క్రౌర్యతదీయ వచోఽనలార్చులన్,
మలమల మాఁడిపోవుదునొ;
మానవనిరుగ్మత బాధవెట్టఁగా,
విలవిలఁ దన్నుకొందునొకొ;
పీడనచింతల గుండెభారమై,
జలజల నశ్రులోడ్తునో; దయ
శక్తిగుణంబు మనంబు వేఁపఁగా,
గిలగిల గింజుకొందునొ; దయ
కించనుఁడం, గరుణారసంబు చి
ప్పిలు కడగంటఁ గాంచఁగద
వే, మనుపం గదవే దయానిధీ! ॥ ౨౦

నెత్తంటి పుష్టితగ్గిన న
నేకరుజల్ వొడకట్టు మేన, డ
స్సృత్తును సత్తువుండదు, క్ష
యించును సన్మతిశక్తియుక్, మదో
న్మత్త వధూజనంబులు స
మాదరణంగన, రొండ్ల సాయము౯
బొత్తుగ లేక జీవితము
వుచ్చ నసాధ్యము, గౌరవంబు కొ
చిత్తును జూపరాశ్రితులు,
చిన్నలుసైతము చుల్కఁజూతు, రా
వ్వొత్తుగ సొత్తుపైఁ గనుల
నెల్లరువైతురు, 'కండ్లచిప్ప' చే
నెత్తురు, చచ్చుటెప్పుడని
యెంచుచునుందురు, చీఁదఱింతు, '...
పత్తున నున్నవాఁడు గద
పాప' - మటంచన, రట్టివార్ శిర
స్సెత్తి, ప్రబుద్ధులంబలెఁ జ
రింతురు నల్గురలోఁ, జతుష్పద
ఉత్తమమెన్న వీరికి, మ
హోజ్జ్వల! వేంకటశైల మందిరా! ॥ ౧౧

ఒక్కటి కడచినదన, నిం
కొక్కటిగా రోగమేదియో యెల్లపుడు౯
నుక్కించుచుండ దేహము
నెక్కరణిం జీవయాత్ర యేఁగింతుఁ బ్రభూ ॥ ౧౨

# శ్రీ వేంకటేశ్వర

## (అనుబంధము).

### 1. సాక్షాత్కారము.

మణిమయాలంకృత మహిత హేమకిరీట
ధగధగ కాంతులంతటను వెలుఁగ.
ఘనసార కస్తూరికా తిరునామంపు
భుగభుగ వాసనల్ పుడమినిండ.
సకల రత్నాంచిత మకరకుండలముల
నిగనిగమను తేజు జగతిఁ గ్రమ్మఁ
కరుణారసాంచిత కమలాయతాక్షుల
జిగజిగ శోభ రాజిల్లుచుండ
యగణితవిభూతి నానంద మతిశయిల్లఁ
బ్రేమ సాక్షాత్కరించి నా వెతలఁ దీర్చి
నీపదాంబుజభక్తి నా నెమ్మనమునఁ
చిరముగా నిల్పుమయ్యా! శ్రీగిరి నివాస! ॥ ౧

### 2. 1930 సం॥ర పరిస్థితి.

శ్రీ వేదాన్వయమేడ? యప్పన కొంగుం
జేఁ జాచు పాటేడ? రా
ట్సేవా ప్రాజ్యతయేడ? నీచనరు నీ
స్నీ! కొల్చుచుంటేడ? స
ద్భావాశ్లిష్ట కవిత్వమేడ? పరదు
ర్భాషా పదాటోపవా
గ్రావాపూరిత సంఘమధ్యమున మొ
ల్గింబూనుటేడం బ్రభూ! ॥ ౨

3. 1931 లో ఉద్యోగములేక బీదఱిక మనుభవించుస్థితిలోఁ గోరికలు.

ఉప్పులవాండ్రెల్లఁ దప్పుడు కాండ్రయి
గొంతుపైఁ గత్తులై కూరుచుండ,
పచ్చి ప్రాలుదురను భయమునఁ జుట్టాలు
గ్రుక్కుమిక్కురనక సక్కియుండ,
మొగము గన్పడినంత మొలఁదడవునో, యేమొ,
యని హితుల్ చాటుగ నరుగుచుండ,
ఇదికి కడచినట్లు 'బడవాలు' 'త్రోకఁగో
సిరె నీ' కటంచు హసించుచుండ
స్వాభిమాన మెఱింగిన యాభిజాత్య
వంతుఁ డోర్చునె? క్షణమేని; పగఱకైన
గలదు, కలనేని వలదు నిష్పచ్చరంబు
శేషగిరివాస! మునిపోష! శ్రీనివాస! ॥

4. అజ్ఞులగు ప్రాజ్ఞులు.

నిత్యభుక్తశేషంబు విడుచుకొనెడు ధర్మ
శాస్త్రాంశములఁగూర్చి చర్చలేల?
యజితేంద్రియత నైతరాంగనారతికిఁ దా
రాడు దేబెకు నీశ్వరార్చలేల?
ముండసొత్తున కాత్మమురియు మూర్ఖున శాస్త్ర
గౌరవమందు విచారమేల?
అంగజతమ్ముల మన్చు లండిపోతుకు గురు
పాదుల సద్భక్తి పరగుటేల?

అత్తవారింటి యాఁడంగి మొత్తుల కల
వడిన పందకుఁ బితరుల ప్రణయమేల ?
ఇట్టి పురుషార్థహీనుని దేటి జన్మ ?
శేషగిరివాస ! మునిపోష ! శ్రీనివాస ! ॥ ౮

అనృత వాక్చిరతియే యామ్నాయ పఠనంబు,
పరదారకాంక్షయే బ్రహ్మవిద్య,
గురుపాదనిందయే సరసవిద్యాప్రౌఢి,
రంధ్రము ల్వెదకుటే ప్రాజ్యనిష్ఠ,
కలహబీజారోపణలె సదాచారంబు,
బంధువిరోధమే వహ్నికర్మ,
మాతృపాదుల నవమానించుటె తపంబు,
కనుఁగానని మదంబె ఘనజపంబు,
దేవ పిత్రర్చనముల మందిరము నందుఁ
దినక పరగేహమునఁ దింటె దేవపూజ
గాఁగ మెలఁగెడువాని మన్గడ యదేల ?
శేషగిరివాస ! మునిపోష ! శ్రీనివాస ! ౯

౨. కుమారీ సామకదంబము.

ఘనతర మహాత్మ్య సంభవ
గావుట ని ద్దలఁచుపాంటె, గాదిలికూఁతుర
'దేవుఁ'డని పిలుచుచుందుము,
శ్రీవేంకట శైలవర్తి ! చిన్మయమూర్తి ! ౧

సీ. నే మాకులదైవమాట, నను నెం
తేనిఁ భవత్సత్కృపా
పావీణ్యాంచిత దృష్టులే యెపుడుఁ బ్రో
పై కాచుచుంటం దయన్
గీ. విన్నాళ్లకు నిచ్చినట్టి సుతకున్
నిండారు భక్త్యున్నతిన్
దేవా! నీదగు పేరితోఁ గలిపి ప్రీ
తిం దల్లి పేరుంచితిన్ ॥

తల్లికి వత్సలత్వము సు
తవ్రజమం దమితంబు, గాన, నా
తల్లియ నాకుఁ గల్గుకొ టఁ
తం దొలఁగింపఁ దనూజయై ఘుటుక
తల్లిప్రియంబు సూపె, వసు
ధాధరమందిర !, తల్లులందు నా
తల్లికి నీడు సేయఁదగు
తల్లులు గల్గరు కల్గరెన్నఁడున్ ॥

కృత్తికాతారయందు నుత్పత్తియగుటఁ
జేతి మాతోన్మదయమున రంజింపఁగనుట
'సుదయరంజని' యన పేరు ముదముతోఁ జ
సిడితిఁ బుత్త్రికి మోకాళ్ల ముడుపువాఁడ ! ॥

## 6. లుబ్ధుఁడు.

అన్నప్రాసము నాఁడయ్యగారి కద్దెడు
నూకలీయఁగ నేడ్చె లేకిముచ్చు,
అన్మరోగము మాప నౌషధమునకు వై
ద్యునకిడఁగా నేడ్చె దొంగలంజి,
అత్తగారింటిలో నడుగిడఁ దిండి ధం
డుగయంచు నేడ్చెడు నగడుమారి,
అన్నదమ్ములసొమ్ము లపహరింపఁగఁ జూచి
చేతఁగాకేడ్చెడు చెనఁటిపోఁతు,
ఆలిమంగళసూత్రము నమ్మి వడ్డి
కీయలేనైతి నని యేడ్చె నెడ్డెరాశి
జరపుదురె నిత్యభోగముల్ సరవిమీఁకు ?
పాలితదిగీశ ! శ్రీశేష శైలవాస ! ॥

## 7. నిందాస్తుతి.

నిను నెడఁబాయక నీకుసెజ్జగు నహి
కులపతి తలఁ బెడ్డఁగొట్టినావు,
నీగానమే సదాసాగించు సురవాని
దేశద్రిమ్మరిఁ జేసి త్రిప్పినావు,
నీయెద పీడని యాయిందిరను మోహ
గించి యన్యలతోఁ రమించినావు,
తనయసుతు లిల నిలువనీడను భోజ
నముఁ బాసియుండ నొనర్చినావు,

పజ్జ మెలఁగెడి నీవారి బ్రదుకెయిట్లు
తెల్ల వార్చితి, వింక, మాదృశులమునికి
పలుకవలెనొక్కొ! యాశ్రితపాళి నెట్లు
బ్రోతువని నమ్మనగు శేషభూధరేంద్ర! ॥

## 8. సంశయావస్థ.

పాథోధి యలలచేఁ బ్రాణంబు విసివెనో,
యిల్లంట్రమునఁ జాలఁ బుల్లసిలితో.
*కడలింకోనున్న రక్కసులకు జడిసితో.
అల్లునికే లేక యగడువడితో,
దర్శింపవచ్చు దేవరలకుఁ దొలఁగితో,
పాలవాసన మదిఁ బట్టలేదో,
భూదేవి విరహంబుఁ బోకార్ప నెంచితో,
సర్పంబుమైత్రికి శంకఁ గనితో,
భర్తనెపఁబాసి, భ్రష్టయై పాఱివచ్చు
కాంతు గంగఁగనంగ సంకోచపడితో,
క్షీరనిధివిడి తిరుమలఁ జేరనేల?
మహిత భవపాశనాశ! పద్మావతీశ! ॥

## 9. అలక్ష్యము.

'దిక్కు లేకెల్లరును, నన్నె, దేవిరింతు
నెపుడు, రక్షింపు' – మనియంచు నేదమన...
నిజ్జనిగ్గెదు, మిత్తికి, నీదుగొనము
నరసితిం, గొండ దొంగదాసరి! సెబాసు! ॥

---

*యష్టావసంగిన ధనాఢ్యత్మున కదలితో.

## 10. దశావతారములు.

లీలఁ జేపట్ట నీవు, దామేలుఁగాంచి,
త్వత్కృపందివి వర్ణితదశ వహించి,
పురుషహరివగు నినురాము ముక్తిఁజెఁగులఁ
గొలుచుచుఁ బ్రబుద్ధయున సిరికలికి వెలయు। ౧౭

చేపడఁ దాబేల్ వుచ్చుచు
వేపంది వురుఁగద చిన్న వీక్షలఁ, జుట్టఁ
బో పురుషసింహా!, రాముఁద్రి
చూపుం గొలిచెదను బుద్ధి రోయుచుఁ గలికీ॥ ౧౮

## 11. హరిహరులు.

శ్రీ రమణీ స్తన కోరకలిప్త సా
రంగమదాంచితోరస్కులార!
దారుణకిల్బిషాంతక సమర్థన మహా
తారక నామాంక ధారులార!
నిజభక్త సంతాన నిరత సంరక్షణ
కార్యసాధనశీల కలితులార!
దుర్మదాసురమర్మ నిర్మూలన క్రూర
పద్మారికార్ముక పాణులార!
మీకు నేఁ జాగిమ్రొక్కి యస్తోకభక్తి
*శతక మొండిత్తు భక్తి నంకితముగాఁగ
సమద దానవతతినాశ! జంబుకేశ!
చండకరవంశసోమ! కోదండరామ!॥ ౧౯

---

* కారణాంతరములచే, నిది రెండపద్యములతో నే ఆఁగినది.

శ్రీశైలాగ్రగిరివాస! క్షీరనీరధివాస!
స్వర్ణమహీధరచాప! శార్ఙ్గచాప!
వృషభరాడ్వాహన! విహగేంద్రవాహన!
నిర్మల వరదేహ! నీలదేహ!
కటిచర్మాంబర! కనకపీతాంబర!
వహ్న్యర్క శశినేత్ర! వనజనేత్ర!
పవనాశన విభూష భర్మాంచిత విభూష
రజనీశమకుట! శ్రీ రత్నమకుట!
శాతశూలలసత్పాణి! చక్రపాణి!
వశమె మీమహిమల నెన్న బ్రహ్మకేని? ॥స॥ ౧౭

## 12. పలుకుఁజెలువ.

మగఁడు వృద్ధుఁడు, సుతుఁడు దిమ్మరియు, లేఁగు
టడవిఁ గలసంతు, నీటను వెడలు తేజి
యుప్పులం దేలుమామ, చలాత్మయత్త,
కొపుపు లేని మఱంది యోవాణి! నీకు ॥ ౧౮

ముసలి మగండు, నూళ్ళపయిఁ
బోవు తనూజుఁడు, లేఁగుదోఁ(పుల)
మ్మసలెడు సంతు, దూండ్లకు వ
నంబులు సొచ్చుహుమాయి, యుప్పుల
న్మసలెడుమామ, చంచలత
నూళ్ళకుఁను నత్త, శరీరహీనుఁడై
మసఁగు మఱఁది నీబవిసి
కేలొకొ కత్తెదవింత భారతీ! ॥ ౧౯

ముసలిముప్పున మూల్గు పురుషుండు పెనిమిటి,
దేశద్రిమ్మరియయి తిరుగు కొడుకు,
రేఁగుచెట్లడవిలోఁ దూఁగు సంతానంబుఁ,
దూఁటికై నీటికి దూఁటు తేజి,
యప్పులలోఁ బడి యటమటించెడు మామ,
చపలచిత్తముగల జాణ యత్త
యంగములేని దయ్యంబైన మఱఁదియు,
నలుగురి నోళ్లలో మెలఁగు బ్రదుకు,
అరరె! అన్నియుఁ జక్కఁగ నమరె నీకు,
నింతకే చింతదిగనాడి సంతసమున
ఏ తెమియాఁటుఁటుఁ బాడుదు తేనెలొలుకు
పలుకులను మ్రోళ్లు చివురింపఁ బలుకుఁజెలువ ॥ ౨౦

## 13. శివాశివమూర్తి.

ఒకవంక శశికళాప్రకట జటాబంధ
మొకవంక బంధుర చికురబంధ,
మొకతట్టు నేత్రత్రయకలిత ముఖపద్మ
మొకతట్టు కస్తూరి వికచవదన,
మొకప్రక్క సర్పహారోల్లసితగళంబు
నొకప్రక్క మణిహార నికరగళము,
నొకదిక్కు భూతిమయోన్నత వక్షమ్ము
నొకదిక్కు పీనస్తనోర్జితోర
మొకదెస హస్తిచర్మోత్తంస సత్కటి
యొకదెసఁ బీతాంబరోద్ధత కటి

వెలర దారాపతి ప్రణయాతిశయము
శోభసల్లు శివాశివమూర్తి సతము
సర్వమంగళ శంకరాసక్తిఁదనరి
కరుణ రక్షించుఁగాత! జగత్త్రయమ్ము ॥ ౨౦

## 14. శిష్యులు.

అడుగుటే తడవుగా నంగుష్ఠమునుగోసి
గురునకు నిడె, బోయ కుఱ్ఱఁడొకఁడు,
బాములఁబడి పౌష్యపత్ని కుండలము లో
జ్జల సతికిడె బ్రహ్మచారియొకఁడు,
వేళలెన్ని యన్నికోటుల నాణెములు, నుపా
ధ్యాయుల కిడె ముని తనయుఁ డొకఁడు,
ఉపదేశకుని ఋణంబపనయింపఁగఁ గడు
నిడుమలఁబడె వాని కొడుకొకండు,
వారు శిష్యులో? ; యేపూర్వ భవ్యకర్మ
వశముననో యింతసంపదఁ బడయఁగానె,
శ్రమలఁబడు మాతృ పితృ గురుజనుల మఱచు
వారు శిష్యులో? తిరుమలవాస! శ్రీశ! ॥ ౧

క్షేత్రరాజంబుల సత్రముల్సావిళ్లు
విరివిగాఁగట్టు వివేకతములు
బాటలందున నంచెబండలు బావులు
మ్రాఁకులు నెలకొల్పు మాన్యతములు.
దేవళ్లకుం గ్రొత్త దేవళాల్ మంటపాల్
వాహనాల్నిర్మించు ప్రాజ్ఞతములు,

పాఠశాలలు గ్రంథభవనాలునిల్పి వి
　　ద్యావ్యాప్తి యొనరించు ధన్యతములు
జగతి నెవ్వరో, వారలు శక్తికొలంది
నాదుకొందురు తలిదండ్రు లాత్మగురువు;
లమిత కష్టములం గుందునప్పు డట్టి
వారినిగ శిష్యుల నొనర్పుమా! రమేశ! ॥

## 15. బంధుగులు.

పెక్కులేనట్టి జ్ఞాతినిసుంగులను జూడ
　　బోవఁ బొర్లించుకోఁ బోతిమంట,
తనకొంప గడపమెట్టని బంధుగుల వెళ్ల
　　గొట్టకింటను జేర్చి కొంటిమంట,
తానుబెట్టక, యొరుల్ దయఁబెట్టఁగని సహిం
　　పని తనకది తలవంపులంట,
తానేమొ ధర్మముల్ తగులఁబెట్టిన యట్టి
　　లీవికై మేము వ్యయింపమంట
తాఁడునీడలై యిట్టులందురు వివేక
హీనులై, వారి కడుపుమంటెంత గలదొ!
యితరులోర్వక పలికిన నేమిలెక్క
సాక్షి వన్నిటికీవ శేషాద్రివాస! ॥

## 16. జ్ఞాతిపీడ (వారంటు)

అన్నాతేఁబడి యూప్యముల్దనకు నే
　　నేనాఁటి యప్పొ! కటా!
సస్నంబుం గలిగింప నెంచిటు, 'లరెస్టు
　　వారంటు' పుట్టించి, తాఁ

గన్నున్నిన్ను నెఱుంగ కుత్తమ కుల
గ్రావాశని ప్రాయుఁడై
మన్నంబోలిన దాయవట్టుట భవ
ద్దుశ్చేష్టయే, శ్రీపతీ! ॥
ఆవాధారపుఁ బొరశాలపనికిం
జేరంజనం, దారి, స
న్నానం తేని నయంబెఱుంగని తుగు
ష్పావ్యక్తుచే నీచవం
శావిర్భూతుఁ డొకండు వట్టునట్టు
యంజాలినా వౌర! త్వ
త్సేవాసక్తున కిట్టిదా ఫలము? ఛీ,
ఛీ! నమ్మనౌనే నినుఁ ॥
ఏగా? దాయ కృతానమానముల
నెన్నాళ్లు భీతిల్లి, యీ
ఘోరత్వమ్మున కగ్గమై తిరుగుదుఁ,
సుంతే మనశ్శాంతి లే
కారాటంబున, విశ్వసించు జనులఁ
హైరాను పట్టించి, నీ
పేరుం బెద్దఱికంబుఁ జాటుకొనెదే?
విద్రోహివై శ్రీపతీ! ॥
బోనంబొక్కట, నిద్ర వేఱొకటఁ,
లోకల్ మఱొక్కంట, జే
హానూన శ్రమఁదీర్చుటొండొకట, వి
ద్యాబోధనం బొక్కటఁ

మానఁగాని విచార మింకొకట, ని
    ర్మాణమాడ్కిఁ గృహంబుఁ సతిఁ
మానంబున్విడి పట్టణంబునఁ జరిం
    పం జేసెదే? నిర్దయా! ॥ ౮

17. ద్రవ్యనష్ట పరంపర.

తండ్రి కప్పగువాని తప్పు లెక్కను గొంత,
    జనకుని యలసవర్తనను గొంత,
అంధులమైన మాయపరాధమునఁ గొంత,
    నొకరిలో నొకరు లేకుంటఁ గొంత,
జ్ఞాతికిఁగల్గు నాశాభూతమునఁ గొంత,
    మధ్యవర్తుల భేదమహిమఁ గొంత,
నా కేలనొ చుట్టాల దాక్షిణ్యమునఁ గొంత,
    పగవాని చెలికాండ్రవలనఁ గొంత,
వ్యవస్థలమునఁ 'గోర్ట' నురుటుచేఁ గొంత,
    'ప్లీడర్ల' సంతతపీడఁ గొంత,
'పక్షీళ్ళ కోర్ట్ల సిబ్బందుల' చేఁ గొంత,
    'పిటిషన్ల, స్టాంపుల' విధినిఁ గొంత,
పిత్రసమార్జిత ధనము స్వార్జితముఁ జెడియు
మిగిలితిమి మేము నల్వురమే యిఁకేమి
భయము? — దీనికి నేకులపాంసనుండ
కారకుండో చెప్పవలెనె? వేంకటగిరీశ! ॥ ౧

## 18. ఇంటికొఱంత.

గుహలు సింహాదులకుఁ, బులుంగులకుఁ గూఁడ్లు
పుట్టలుం బాములకుఁ, గొట్టములు పసులకుఁ
పురుగులకు బిలములు వాసములుగ నలిపి,
నలుపకుంటివె నీడ నేనిలువ, శ్రీశ ! ॥

'వసతిగృహా' యని సంక
ల్పసమయముల నెన్నినాళ్ళు పలుకుదునను నాఁ
వ్యసనముఁ దొలఁగించిన హితు
నెవఁడు లే ? తదృణమునుఁ దీర్పఁగునే నాకుఁ ॥

## 19. మహాసంగ్రామము.

"పాపము ధర హెచ్చిన, నీ
కోపము కడురెచ్చు", నంద్రు కోవిదు ; లిప్పు డీ
'జాపను' 'జర్మను' పోరి క
లాపమె, యందులకు నొక్క లక్ష్యము ? దే...

'సైరను' — రోదనశబ్దము
ఘోరా ! గుండెలను జల్లుమనిపించెడి, దీ
నీ పోరాట మడఁగు టెప్పుడొ ?
పోరాటము నిలిచి శాంతిపొసఁగుట యెప్పుడొ ॥

'అన్నా' లభించుట యపురూపమగుటచే
'కాఫీ' నీళ్లకుఁగూడఁ గఱవు వచ్చె,
'కెరోసినాయిల్' చాల దొరకమిచేఁ జేసి
'లాంతర్లు' వెల్తురు లంతరించె,

వంటకట్టియలు సంప్రాప్తంబుగామిచే
'హోటల్' పదార్థాల లోటుగలిగె
'పెట్రోలు — రేషను' పీఁకిళ్ళ, 'మోటారు
కారు' ల గడబిడల్ దూరమాయె
'స్ట్రీటు' దీపాల టోపీల చాటుచేత
నొంటినడవఁగ మది దిగులూఁగులాడె
'బాంబు' గుండ్ల విషాగ్ని జగంబుగాలె
అకట! ఏమిది, స్వామి! నీయాజ్ఞ యేమి? ౩

ప్రజల శాపాన 'హిట్లరు' ప్రమందెఁ గడకు
'నాజిజము' రూపులేకుండ నాశమయ్యె
'జర్మనీ' దేశమున జనశక్తి వాలిసె
మిత్రరాజ్యాల జయభేరి మించిమ్రోఁగె॥ ౪

## 20. ఉదరశూల.

ఓ యుదరశూల! మునుపెప్పు
డో, యొకనాలైదునాళ్లె యుందువు, కలఁతం
జేయుదు, వోదు, వాకేడుగఁ
బాయక, వేఁపుకొని తిందువా? యిటులకటా! ౧

'బెలడోనా' — మదరాస్ లో
పలఁ, గల యంగళ్లలోనఁ గానఁబడదెం, దది శ
త్రుల దేశంబగు 'జర్మని'
వలనం దిగుమతులె లేమి; బ్రదుకింకెటులో?॥ ౨

జర్మని మెడిసన్స్, గ్లాసెస్,
ఫర్మాస్లాస్కులు, మెషీన్సు తగుటాయిలెట్స్
వార్మింగుకార్సు, బ్లేడ్సు
వార్ (WAR) మహిమను భరతధర కభావం
బయ్యే ॥

## 21. లలాటలిఖితము.

అన్నదమ్ములకు బాధ్యత తుల్యముగఁ గల్గు
పనుల కేన ధనంబు వ్యయము సేయ
నలవి కానట్టి కార్యములకుఁ దలపెట్టి
పూర్తి సేయక మధ్యమునఁ ద్యజింప
నన్యరంధ్రాన్వేషణాసక్త బంధుల
నీలాపనిందల పాలువడఁగ
నాపదలందు సాయ మొనర్ప 'నా' — యను
వారుండి లేనట్టి వనట నొంద
నానొసట వ్రాసి వేడ్క నొందంగఁదగునె ?
పాపమన, కిట్టిచేఁతల ఫలమ కాదె ?
పడఁతి నల్వోరనోళ్లలోఁ బడఁగ విడిచి
ముదిసి నట్లైనఁ గనుచడ లెదవు నీవు ॥

## 22. ఆత్మీయులు.

చిన్ననాఁటనుగోలె గన్న సంతానంబు
కన్న మిన్నఁగఁ బెంచికొన్న నేమి ?
చదువుసాములు నేర్పి కొదువలన్నియుఁ దీర్చి
బ్రతుకుఁ ద్రోవనుజూపి పొదల నేమి ?

తన యార్జనంబౌక తృణమేఁ గొనక, యింటఁ
దినుమని పిల్చి పెట్టినను నేమి ?
కడచి బ్రతికినట్టు లెడఁదకుఁ గష్టంబు
లిడినఁ గిమ్మనకుండఁ బడిన నేమి ?

యురగమ, ట్లగ్నియట్టులు, గరళమట్లు
పుంటియట్టులు పెనుముంటి పొదరునట్లు
భూతమట్లింతయును, బాపభీతి లేక
ననునొగుల్చు వానికి దీవనములె, శ్రీశ ! ॥ ౨

'నా' — యను మగతోడు 'నాస్తి' యై, తక్కిన
పెద్దవారోమ్మముఁ దప్పించినపుడు,
'సాఁకుదు' మనిచేర్చి, సర్వంబు దిగమ్రింగి,
నెత్రుపాశము వారు నెట్టినపుడు,
ఆరోగ్యమును విద్యనణఁచి నౌకరిఁ బెట్టి
తల్లితోడు బ్రదుకఁ దలఁచినపుడు,
జంబాలకోరులౌ సంబంధులున్న ది
గొఱిగి, సత్సమయాన మొఱఁగినపుడు,

పంచఁజేరిచి యొకయింటివానిఁ జేసి
బాగుపడ నెల్లపుడుఁ గోరువాని పైని
మోయరానట్టి నిందను మోఁపునట్టి
యాత్మవంచకుఁ గాపాడుమయ్య ! శ్రీశ ! ॥ ౩

### 23. ఆప్తమిత్రులు :—(14-2-1946)

### (శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారు)

మామక ప్రాణమిత్రమ ! మాననీయ
చరిత ! బూదూరు రామానుజ ప్రశస్త !
సమయమున సాయపడు నీ విచక్షణతకుఁ
జిత్తమానందజలధివీచికలఁ దోఁగె ॥ ౧

అవసరమునఁ దోడ్పడి, వా
స్తవముగ నన్నిటు కృతజ్ఞతా శృంఖలలఁ
దవిలించితి వెంతటి జా
ణవు, నాయభినందనాల్గొనంగదె సఖుఁడా ! ౨

మూన్నెల్లనాఁటి మిత్రుని
విన్నపమున్మఱువకుండఁ బ్రియమునఁదీర్పఁ
గన్నట్టివార, లెవ్వరి
విన్నారము నిన్నుఁ దప్ప విహితవరేణ్యా ! ౩

'ఆంధ్రపాండవగీత' లలనాఁడు రంగయ
హితున కంకితము సేయించినావు,
విహిత మండలికి నా విద్వత్కవిత్వ శ
క్తులఁగూర్చి, ప్రకటించి పలికినావు,
చిన్నారి కల్పవల్లి న్నిజ వాక్యామృ
తాంచితఁ జైకిఁ బ్రాఁకించినావు,
తలకు మించిన కార్యములె గల్గినను, మొట్ట
మొదల నాపని సేయఁబూనినావు,

చెలుతనికి వచ్చినపుడెల్లఁ జిత్తమలర
సత్కరించి, ప్రియంబుల జరిపినావు,
మిత్రు లెందఱో కలరు, నిన్నెంచువారు
మాత్రమెవరును లేరు రామానుజార్య! ౪

(శ్రీ కనమలూరు శివరామయ్య గారు)

పంచత్కృపఁ బద్మామహ్మ
ప్పాంచకుఁ, డాయుర్యశోవిభవసంపదల
భ్యంచితగతి నొసఁగుచు ర
క్షించుత! శ్రీ కనమలూరి శివరామార్యున్ ॥ ౧

(శ్రీ దావూలూరి మునిరత్నము నాయఁడు గారు)

'రత్నము రత్న'-మన్న, 'ముని
    రత్నమె రత్నముగాని; 'కోహినూర్'
రత్నము లాతిసొమ్ము; నవ
    రత్నములన్ననో, రంగుటాల్; సభో
రత్నము నిప్పుముద్ద; సుర
    రత్నమదృశ్యము; శర్వపాళిపై
రత్నము నిత్యతేజమున
    రాజిల దేటికిఁ దన్మహత్వముల్ ॥

నిను నెంచినఁ జెలుతని, చెలు
తని నెంచిన నీవు జ్ఞప్తిఁదగులుట జనముల్
మునిరత్నమె చెలుతని, చెలు
తనియే మునిరత్నమంచుఁ దలఁతురు హితుఁడా! ॥ ౨

(శ్రీ కసిరెడ్డి నరసారెడ్డిగారు)

పరమ దేశోద్ధరణ కార్య కరణమందు
సరససాహిత్య విత్సమాదరణమందు
పరదయాసత్య ధర్మానుసరణమందు
నెఱుఁగ నీ వడ్డి, కసిరెడ్డి నరసరెడ్డి ॥ ౯

జంకం గొంకను వశ్యవాక్యనుచు, వి
స్తార ప్రజాసేవనా
శంకుండంచు, నిజాశ్రితామరధరా
జాతంబ నంచుఁ, జ్యాతా
హంకారుండసి, భవ్యకావ్యరస ని
త్యాస్వాదనుండంచు, నే
ఘంకా గొట్టి నినుం గకు ప్తటులఁ జా
టన్, రెడ్డి వంశాగ్రణీ! ॥ ౧౦

లేశము త్రాసము లే, దా
వేశము నీసంబు లేదు, విసువుట నీ కే
క్లేశమునను లే, దీకఁగీ
నాశిత లేదు, కసిరెడ్డి నరసారెడ్డి! ॥ ౧౧

(శ్రీ పసల గోపాలరెడ్డిగారు)

పేరుగల పాకనాటి బంగారు కడ్డి,
సకులపాలిటి యమృతరసంపు బుడ్డి,
పేదరైతుల కూలీల వేల్పు గడ్డి,
పలుకుఁబసగల పసల గోపాలరెడ్డి ॥ ౧౨

(శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి)

వినుతాంధ్ర విశ్వవిద్యా
ఘనసంస్థా ప్రథమపాలక ప్రవరు, సుధీ
జనతోత్తరుఁ, దలఁతు, సుశీ
లిని, హితుఁ, గటమంచి రామలింగారెడ్డిన్ ॥ ౧౨

(శిష్యత్రయము)

శ్రీనాటి నాగనార్యు, న
నూనగుణున్ ; రామరాజు, నుపకారపరున్ ;
మానధనుఁ, జంద్రపాలుని ;
శ్రీనాథుఁడు ప్రోచుఁగరుణ శిష్యత్రయమున్ ॥ ౧౩

24. ఉగాదులు

(యువసంవత్సరము)

ఈయువ వత్సరాది, నను
నెంతయుఁ బ్రేముడిఁ జూపుఁజూచి, నీ
చాటుకు రా నొనర్చితి, వి
చారము జారె, ముదంబు మీరె, నీ
హేయపుఁ బుట్టువుల్ దొడర
నీయక, త్వత్పద పద్మయుగ్మముం
బాయక యెప్పుడుం గొలుచు
భావమొసంగుము వేంకటేశ్వరా ॥ ౧

నీ సౌందర్య విలాసవైఖరులు ని
ర్నిద్ర ప్రమోదప్రదం
బై సర్వాంగము పుల్కరించెఁ, గనుల
త్యానంద బాష్పాంబుధా

రాసారంబున ముగ్గెఁ జిత్తమును జా
        డ్యం బొందె, నిం, కే మొఱల్
నీసంస్తోత్రము లాచరింపఁగలమో
        నీలామనోనాయకా ! ॥ ౨

తెలఁపున భావ ముట్టిపడఁ
        దత్పరత న్నిను సన్నుతింపఁగాఁ
దలకొన రాపడెం గళము
        దండ్రి ! యెటో మదిఁ జిక్కఁబట్టి, వి
ష్టలవలెఁ దొక్కు పల్కుల, న
        డంకువతో, నిదె యొందు రెండు సూ
క్తుల వచియించినార, మిది
        తుష్టిని గైకొను వేంకటేశ్వరా ! ౩

(విషుసంవత్సరము)

విషువా ! లోకాంతక కన
దిషువా ! వరధర్మ కృతిజిగీషువితతిని
ద్విషువా ! కలహాక్రమ సం
స్పృషువా ! నినుఁదలఁప మిగుల స్పృజినముగాదే ! ౧

నేతల్ భూతములైరి, ధర్మరతియు
        న్నిర్మూలమయ్యెం, బ్రజా
వ్రాతంబుం గడుభీతమయ్యెఁ [illegible] సా
        మ్రాజ్యాళి త్యాజ్యాధరా ,

ప్రారంభమ్యెఁ బ్రధానమంత్రితతి ని
స్సంధానమయ్యెన్, మహో
ద్ధతుల్ పీతవినీతమయ్యె, విషువా!
చాలయ్యె, నీరాజ్యమున్. ౫

విషునామాబ్దమ! లోకపీడన కళా
విజ్ఞాన గర్వాంధ వి
ద్వేష చర్మణ్య నితాంత దుర్దమ బల
త్నేక ప్రకల్ప్యాతి భీ
షిప సంజాత ప్రకంపమాన తనులై
వేశ్మాత్మబంధుస్వయం
కృషిభూముల్ దిగనాడి, మూలకొకలై
ఖేదింపఁగాఁ జేసితే! ॥ ౬

శ్రీ వేంకట శైలాధిప
పావనదృక్ప్రసరచిత్రభావమున, జగ
జ్జీవన మేర్పడి, శాంతి స
దా వర్తిలు, స్వస్తిగావుతఁ బ్రజకెల్లన్ ॥ ౭

నవసంవత్సరమున, దా
నవగుణములు లోకమందు నశింపగుతఁ, సన్మా
నవగుణములు రేఁకెత్తుత,
నవజీవ కళానికేతనములగుచు నెసల్ ॥ ౮

(తారణ సంవత్సరము)

ఏలాగ నీయేడుగడచె జీవితములోన
అనుచుఁ బ్రతివత్సరాంతమునందుఁ జింతఁ
బొల్చుచుంటయ కాని ముందటను నేని
సాఁకువగ నుందమను తెల్వి గలుగ దేమి?

రావగఁ ద్రోవఁగఁ, బ్రోవఁగ
రావా? యేవారి నమ్మరాదని, నిన్నే
భావించితి, సేవించితి
శ్రీవాసా! తిరుమలేశ! చిన్మయభాసా!

(పార్థివ సంవత్సరము)

శ్రీరమణా! త్వత్కరుణా
భారమునం, గడవఁగంటిఁ 'దారణ'—నిఁక నే
తీరున నవ 'పార్థివ' సమఁ
బారము నేర్చెదవొ నీదె భారంబభవా! ॥

వారణ మారోగ్యమునకుఁ,
బ్రేరణము ప్రసిద్ధిఁ జెఱచు కృతులొనరింపన్,
గారణ మపదూరులకున్
'దారణఁ'—దారణముసల్పి ధన్యుఁడనైతిన్ ॥

'పార్థివ వత్సరమా! నను
వ్యర్థుఁ, డపార్థాంకుఁడంచు భావింపకు, నీ
పార్థివతఁ బైటఁబెట్టు, స
మర్థుఁడఁ, గవిపార్థివుండ, మది మఱవకుమా! ॥ ౧౩

(సర్వజిత్సంవత్సరము)

అన్ని జిత్తులదానవో, యట్లుగాక,
యన్నిటిం గెల్చుదానవో, యరయఁగలమె ?
నీదు బండారమును దెల్పు నీదుపను లె
కాన, నోసర్వజిత్త ! జాగ్రతగ మెలఁగు ॥

## 2౨. చెల్లెలు

నల్లఁగ నల్వ దేండ్లయిన
సాగకమున్నె, యిహంబురోసి, నీ
పిల్లలఁజల్లల న్విడిచి
పెంపగు కాపురముం దృజించి, నీ
నల్లసురాలయింబునకు
నక్కట ! యేమని పోయితమ్మ ! యా
చెల్లెల ! లక్ష్మి ! నీ కనులఁ
జెల్వగు లక్ష్మిని విస్మరింతు నే ? ॥

శాంతుఁడు, దాంతుఁడుం, బుధుఁడు,
సజ్జనమాన్యుఁడు, నీవిభుండు వి
భ్రాంతమనస్కుఁడై వెతల
వ్రస్సిన గుండెల బర్వుతోడ నీ
చింతకుఁ జేరె, సౌఖ్యము న
శించుటచేత, నిహంబునం దశ
శ్శాంతిని గూర్పు మాతనికి
సల్లలితామలశీల ! చెల్లెలా ! ॥

నీవు పితృదేవతలఁ జేరినావు, కానఁ
గ్నానంగలనే నీదు కాయమింక
స్వాస్సుఖంబుల సంతోషపడుచు, సతము
నీదు సంతతి దీవింపు మాదరమున ॥

26. కీ. శే. గుండారెడ్డి రంగయరెడ్డి

సంపులై యాచకకోటి నీ సదనంబు
డాసినఁదృప్తులఁ జేసినావు,
రేయిఁబవలనక యోర్మిని విఘ్నవితతు..
డ్డిన సిల్చి సంఘము న్మనిచినావు,
ఆంజిల్ల భాషాభిరక్షుఁబూని కవీంద్ర
గణమును బోషింపఁ గడఁగినావు.
ఋత్నించి 'బుగ్గ' దేవాయతనముఁగట్టి
రెడ్డి దొడ్డతనంబు రేఁచినావు,
శాంత, మాద్యక్షరపదంబు స్వర్గసీమ—
తిరముగా నిల్ప మది నెంచి యరిగినావు,
కాంతుమే నినువంటి సంగాతకాని ?
చక్కవలెఁ గీర్తి దీప్తి పెంపెక్క వెలుగ ॥

27. అనుతాప గీతి

కాల లీలాస్రవంతిని గడచు నోడ
భగ్నమయ్యెను విధి శిలాపతనసరణి,
కాలదివ్య ప్రకాశంబుఁ గలుగుదివ్వె
గూటిపోయెను విధిచండ మారుతా స్త్వ.

...లలతికాగ్ర వికసితక ప్రసూనము
నల్లిపోయెను విధి గోటిగిల్లు తగిలి,
కాల సౌధోపరిస్థిత కనక కలశ
మవనిఁ బడిపోయె విధివజ్రహతిఁ జలించి ; ౬

మెఱుపుగొల్పి యదృశ్యమౌ మినుకులట్లు,
...బు చూపించి చనెడు మతాబులట్లు,
...ప్తిమించి నశించెడు దివ్వెలట్లు,
...కుఁ గలిగించి మఱుఁగగు చుక్కలట్లు ౭

*తళుకుమని వెల్గి యచిర మస్తమయమైరి
విధినికారమునం జేసి, విజ్ఞులెల్లఁ
గడుపు చెఱువగు నవ్వారికతలు దలఁప ౮

పక్షభేదము లెంచని భవ్యుఁడతఁడు,
స్వపరకులచింత లెఱుఁగని నిపుణుఁడతఁడు,
పరులకుం గీడురోయని ప్రాజ్ఞుఁడతఁడు;
స్వసుఖచింతయు నరయని సాధువతఁడు, ౯

నాటకపు జనపాళికి కల్పతరువతఁడు,
దీన కర్షక తతి కామధేను వతఁడు,
మందభాగ్యార్తగణ దేవమణి యతండు,
భరత దేశాభ్యుదయకర—బంధుఁడతఁడు, ౧౦

---

* కాలగర్భాన లీనమైరి కడచి చనిరి

విద్య నేర్చియు నతఁడింత బిగువుఁగనఁడు,
భాగ్యమొసఁగియు నతఁడింత పగ్గెఁగొనఁడు,
పదవులమరియు నతఁడింత యదరిపడఁడు,
ఖ్యాతి గలిగియు నతఁడింత గర్వపడఁడు.

పక్షమున నెల్లరును జేరవలయునని యె
వ్వతని సర్వసమత్వంబు నడుగవలెనె?
ఖద్దరు ధరియించుటలు దీక్షగానహింస
నతని జాతీయతారక్తి నాడవలెనె?

ఆంధ్ర సభలకు సధ్యక్షుఁడై రచించి,
యతని దేశాభిమానంబు వెతుకవలెనె?
రైతుజనులకు సుఖముఁగూర్పంగ నెంచ,
నతని సోదరభావంబు నరయవలెనె?

అట్టి నాయకమణి, వినుతాఢ్యసుగుణి,
నిజకులాగ్రణి, సత్కృపా నిర్మలఖని,
యనుపమ వితరణి, యాంధ్రిహో రామలింగ
న్యాయపక్షవుఁ దరణి నేఁడ స్తమించె।

అనుచరావళిదిక్కులే కడలుచుండె
చిత్పుర వికాస లక్ష్మియుఁ జిన్నవోయె
ఇంక నేమనుకొన్నను నేమి కలదు?
దైవచేష్టిత మిట్టి దుర్దశఘటించె॥

తన దేశాభ్యుదయ కాంక్షఁ గలిగి యెపుడు
ఘనతని యుద్యమముల ననుయాయు లెల్లఁ
సాధనలు సాగింప యత్నముల్ గొంద్రుగాక !
ప్రభుకృపం బొల్లిని మునిస్వామి బుద్ధుఁడు
త్రిదివమున నాత్మశాంతితోఁ బొదలుఁగాక ॥

## 28. చక్కట్లు

(మధురవాక్యాలు)

ఛందమంజులమోహన మధురవాక్య
వితతి పుట్టుకతో నేర్చు విద్య యేమొ !
స్వార్థరతులకుఁ, బరహితపరుల కరయఁ,
గాని, తొలివారి పల్కులు గరళయుతము,
అమృత మయములు మలివారి, నవియ మేలు ॥

(కార్యసాధకులు)

పండినన్నిగ, యందకున్నపుడు గాళ్లు
పట్టికొనువారు, తమపనివఱకె, యింటి
చుట్టుఁ దిరుగుదు, రానలఁ జూతమన్నఁ
గానరారెందు, నెంతటిఘనులో వీరు ? ॥

(లోభి)

గుండియును మొండిచెయిచూపు లండసాకె,
నేడ వచ్చిన యెడ నాశిబిప్రభుండె,
తెల్లపదమునె పా, డిడనొల్లఁ, డొక్క
చిల్లిగవ్వైనఁ గోడఁ దీసికొని చనునొ ? ॥

(సుద్దులు)

బుద్ధి గలుగంగఁ బెదపెద్ద సుద్దులెన్నొ,
సిద్ధగా వచ్చుఁ బెఱలకే ప్రొద్దుఁ, గాని,
యద్ది తనదాఁక రాఁగ నిబద్ధిలేక,
యజ్ఞుఁడయి వేగఁ బప్పులో నడుగు వేయు ॥

(పరోపదేశము)

నేర్పుగలవాఁడ! నీ నేర్పు నీతులెల్ల
బనికిరావేమొ నీకుఁ; గావున నె, వాని
నదను గనిపట్టి బోధింతు వన్యులకిల
నీకుఁ దగినవి వారికే పీఁకఁ దగునా? ॥

(స్వదోషము)

క్రిందినలు పెఱుఁగునె గురవిందగింజ?
విత్తనపుఁ జేఁదెఱుంగునె వేపపండు?
నుదినెఱుంగునె లోబుజ్జి వెదురుబొంగు?
తనదు దోషమెఱుంగునె మనుజుఁడింత ॥

(ప్రతిజ్ఞాపాలనము)

అధికారంబు గలట్టి వార్యలకు స
త్యాశ్రా ప్రపూర్ణోక్తులం
బధిక ప్రత్యయమునుంచుటే దొసఁగు; సు
మ్మా! శ్రీమైన సత్యవ్రతుల్

బుధులాపూజ్యులు స్వప్రతిజ్ఞ నలుపం
  బూనిక్రొవహిం, త్రన్యులో,
విధిలేకాడుచుఁ బొల్లుకూఁతల సదా
  వేధింతు రార్యావళిన్ ॥ ౭

(తీర్పరాని యప్పులు)

జనని ఋణమును, గురునప్పుఁ, జాఁకి వాని
పర్యుదంచన మెవడు దీర్పంగలేఁడు,
గాన, శక్తి కొలందిఁ దన్మానసములఁ
దనుపుటయ, ధర్మమగుఁ బురుషునకు శ్రీశ ! ౮

(రైతు—వ్యాపారి)

చిగురుకొఱకుఁ జెట్టుఁ జెక్కుటసరి, కాని
  కూఁకటి వ్రేళ్లతోఁ గూల్పరాదు,
వేడుక రబ్బరు వెఱుకుటసరి, కాని
  యిరుతుంటలగుదాఁక నీడ్వరాదు,
కొమరుని వెఱపింపఁ గొట్టుటసరి, కాని
  కుట్టుసురఱఁ బెట్టు పెట్టరాదు,
కడుపు నిండఁగ నన్న మిడుటయుసరి, కాని
  గ్రుక్కు పైకుబ్బఁగఁ గుడుపరాదు
రైతుకడ నప్పురాఁబట్టురీతి యిటులె,
తెలిసి, తనకును వానికేకలఁత గలుగ
నట్లు మెలఁగి స్వకార్యమునందు జయముఁ
గనువణిజునింట సిరియుండుఁగాపురంబు ॥ ౯

(అత్తిల్లు)

*స్వర్గ్యాసోపమ మత్తయింటి సుఖమెం
చ న్మానవ శ్రేణికిన్,
హర్మ్యం దెల్పగలట్టి వాని కయిదా
ర్నాళ్లే యటన్నిల్వఁగన్,
గర్వైనం దధియుం ఘృతంబు మధువున్
మాసంబు నేనుండెదన్,
గర్వంబూఁడఁ దదంత మొక్క దినమై
నం బాదరక్షాహతుల్ ॥ ౧౧

(మనోగతి)

తలఁపులబుగ్గ మానసము,
తత్త్వవినిశ్చయమందు నెంతయుం
జలనమునందు, నొక్కపరి
సర్వకులాచల తుంగశృంగభూ
ములఁదిరుగున్, మఱొక్కతఱి
భూరి సముద్ర సమగ్రభాగమున్
సులువుగముట్టు ; మించుగతి
చొప్పను మందమె, దానిముందటన్ ॥ ౧౧

*శ్వశురగృహనివాసో స్వర్గతుల్యో నరాణామ్ యదిభవతి వివేకీ పంచ వా షడ్దినాని దధిఘృతమధులోభా న్మాసమేకం వసామి తదుపరి దిన మేకం పాదరక్షాప్రయోగమ్ ॥

## 29. నవరత్నమాలిక

ఈ పద్యములు కడపజిల్లా కోడూరుగ్రామమందలి శ్రీజ్ఞానోదయనిలయ కార్యనిర్వాహకమిత్రమండలి ప్రోత్సాహమువలన ననంతపురమున 1919 సం॥రం ఆగష్టు 23, 24, 25, లలో జరిగిన సప్తమాంధ్ర మహాజనసభలోఁ జదువఁబడినవి.

శ్రీలన్ జెల్వొసలారుచున్ సుతులచే సేవల్ దగంగొంచు, స
చ్ఛీలుల్, సాధులుఁ, బండితుల్ దను బ్రశంసింపంగఁ బెంపొంది, యె
వ్వేళన్ సూనులభవ్యమే యరయచున్ బేర్మిన్ మహోత్కృష్టయై
హేళిన్ బోల్చెడు నాంధ్రమాత కివె నే నర్పింతుఁ గైమోడ్పులన్ ॥ ౧

శ్రీశైలమాదిస - క్షేత్రంబులెల్ల నీయందుఁగాదొకో ! పొల్చు - నాంధ్రమాత !
గోదావరీముఖ్య-హోత్రిదినుల్ జూడ నీయందుఁ గాదొకో ! యొప్పు-నాంధ్రమాత !
దండకాద్యాటవుల్ - మెండుగానుంట నీయందుఁ గాదొకో ! చెప్పు -
మాంధ్రమాత !
వివిధమహీధ్రముల్ - వెల్గుచునెప్డు నీయందుఁ గాదొకో ! మించునాంధ్రమాత !
పరమకారుణ్యచిత్తులు - భవ్యమతులు నీతియుతులును విజ్ఞులు - నిర్మలయశు
లరయ నీయందుఁ గాదొకో - వఱలుచుందు రార్యనుతగుణసంఘాత -
యాంధ్రమాత ! ॥ ౨

పుత్రివై, విమలచా - రిత్రవై శ్రీభారతాంబఁగొల్తువు గాదె - యాంధ్రమాత
మాతవై సర్వదా - పూతవై సూనుల నాదరింతువు గాదె - యాంధ్రమాత
దేవివై మన్నించు - దీవివై దీనులయార్తివాపుదు గాదె - యాంధ్రమాత
పుణ్యవై యార్యాళి - గణ్యవై కోర్కులీ వరసియిచ్చెదు గాదె-యాంధ్రమాత
అమ్మ నిన్నెప్డు భక్తితో-నమ్మునతని కన్నియనుగూర్తుగాదెయో-యాంధ్రమాత
ఎందుఁగలదీకఁ గొఱఁత నీ-నందనులకు ఆర్యనుతగుణసంఘాత -
యాంధ్రమాత ! ॥ 3

పుస్తకాగారముల్ - పొల్పుగా నెలకొల్పి భావనుసేవించు - భవ్యమతులు,
సంఘసభల్ నిల్పి - సంఘదురాచారములఁ ద్రుంపఁజూచుస - ద్బుధవరులును,

స్వాతంత్ర్యవాదముల్ - సల్పుచుదానికై శ్రమనొందుచుండెడు - విమలయశులు
పత్రికల్ ప్రచురించి - ప్రజలలో విజ్ఞానమును వ్యాప్తినొందించు - వినుతగుణులు.

నందఱును నేఁడునీచర - ణాబ్జములను డెందములనిల్పికొలువఁగ - డిందిభక్తి
నేఁగుఁదెంచిరి చూడుమా ! - యెలమిమీఱ ఆర్యనుతగుణసంఘాత ? -
యాంధ్రమాత ! ॥ ౪

'దేశభాషలయందుఁ దెనుఁగులెస్స' యటన్న నాంధ్రభోజునిదివ్య - మైనపలుకు,
నెలమిఁజూడఁగ "జన - నీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయ" - సనెడుపలుకు,
నరయ విద్యావిహీనఃపశుభిస్సమానః" యనునీతి రైనట్టిపలుకుఁ,
"బరవశందుఃఖ"మన్ భవ్యమౌపలుకును, "నాత్మవశంసుఖ" మనెడుపలుకు

మఱచిపోవకి మాహాత్మ్యమలములందు మననముఁజేయుఁడెల్లప్డు - తనయులార!
యనెడునీబోధశిరముల - యందుఁదాల్తు మార్యనుతగుణసంఘాత ? -
యాంధ్రమాత ॥ ౫

విశ్వవిద్యాలయా - వేశంబువదలక కృషిసల్పుటెంతయుఁ - గీర్తికరము,
ప్రత్యేకరాష్ట్రాభివాంఛనుబాయక ధీరులైపూనుట తృప్తికరము,
ఆంధ్రాంగ్లపత్రిక - కగుశ్రద్ధవిడువక పాటుఁజేకొనుటెంతొ - భాగ్యకరము,
"ఆంధ్రుల" మనిచాటు నాసక్తిమానక నిటవుతోఁగైకొంట - దీప్తికరము.

కరముఁ గనికరమొప్పనం - దఱనుస్వీయసోదరులభంగిఁ గాంచుటే శుభకరంబ
టంచుబోధించు నీప్రేమ - నెంచఁదరమె ఆర్యనుతగుణసంఘాత -
యాంధ్రమాత ॥ ౬

ఆంధ్రమా ! నాన్నెన్న - ఆంగ్లంబుతో సాటిభాషయాయది? యని - పలుకువారు
రామాయణం బేమి? - రైనాల్డ్సునావెల్సుఁ బోలునా? ఛీ! యంచుఁ - బ్రేలువారు
పాశ్చాత్యజనులచేఁ - బ్రభవించెజ్ఞానంబు మనకసలెక్కడి - దనెడువారు,
డర్టీఫెలోస్ మన - డామిట్సు హైందవుల్ కొఱగారటంచువా - గెనెడువారు.

అక్కటా ! స్వాభిమానంబు - నవలఁద్రోసి యిట్లు మనవారెగేరద - రేమిచెప్ప?
వెన్నవంకను నింటివా - ర్వెక్కిరింప నెదుటనే పేళనముసేతు - రితరసరులు
ఆర్యనుతగుణసంఘాత ! - యాంధ్రమాత ॥

ఆంధ్రభోజుండు వోయె-నంచు నేడ్చెద వేల? పీఠికా పుర నేత-వెలయుచుండఁ,
భోతన లేఁడంచుఁ - బొగులఁగా నీకేల? ఆంధ్రవాల్మీకి తా-నమరుచుండఁ,

దిమ్మరసరిగానం - చుమ్మలించెద వేల? విశ్వేశ్వరునివంటి - విజ్ఞులుండ,
రణతిక్కఁడేఁ గానం - చనివగపా? యశఃకాముఁడై కలియుగ - భీముఁడుండ.
నీదు సేవను జేసెడు - నిష్ఠులెవ్వ రిపుడు లేరంచు దుఃఖింప - నేల తల్లి?
సిద్ధమైయుండ నీసేవ-చేయసుతులు ఆర్యనుతగుణసంఘాతయాంధ్రమాత || ౭

ఆంధ్రదైనికపత్రి - కాప్రచారకుఁడు శ్వేతచ్ఛత్రముఁ భక్తిఁ - దాల్చి నిలువ
ఐయ్యాన్వయాంభోధి - వారిజారాతి త్యాగజామరంబొకవంక - సరగ విసర,
వేంకటప్పయ్యయు - వేఱొండువైపున మఱియొండు చామర - మందివీవ,
మోచర్ల కులుఁడు స - మ్మదమున నీవెన్కఁ జేరి తాళవ్యజనంబు - చేవిసరఁగ,
న్యాపతిసుబ్బరా - వాతతభక్తితో రజతవేత్రంబొండు - రహిఁవహింప,
భోగరాడ్వంశ్యుండు - పొల్పుగా వేఱొక్క వెండిబెత్తంబును - వేడ్కఁ బూన,
వేంకటపతిరాజు - విమలభక్తిని ఖడ్గముఁ గేడెముఁ బట్టి - ముందు నిలువ,
సర్వోత్తమాఖ్యుండు-సాభిలాషంబుతో మ్రొక్కుచు నిన్ జేరి-పొగడుచుండఁ,
గెలననామంచెర్ల-కృష్ణరావెలుగెత్తి "యాంధ్రమాతకు జయ"-మంచు నొడువఁ
గవులెల్లఁ దమచేతఁ - గావింపఁబడినట్టి గ్రంథరత్నంబులఁ - గానుకలియ్య,

నిండుకొలువుండు తల్లిరో! - నేఁడు నీకు లలిసమర్పించితి దీనవ - రత్నమాల
తప్పులుండిన నోర్చి సఖ - దయనుగనుమ ఆర్యనుతగుణసంఘాత! -
యాంధ్రమాత || ౮

---

అఖండయతులు మున్నగు లక్షణవిరుద్ధ ప్రయోగములును, కొన్ని వ్యాకరణదోషములు ఇందుఁగలవు. ఇవి నా యిరువదేండ్ల ప్రాయమున వ్రాయఁబడినవగుట—ఆనాఁటి నా కవిత కుదాహరణములుగ నుండునని. వీనిని యథాస్థితములుగఁ, బ్రకటించితి. —గ్రంథకర్త.

# 30. కల్పవల్లి

అంకురించిన వనమున కమిత కాంతి
వ్రేళ్లు నాటిన తోఁటకు విపుల తేజ
మల్లుకొన్నట్టి చోటికి కత్యంత శోభ
గలుగ వెలిఁగితి వమ్మ, యో - కల్పవల్లి ॥ ౧

ప్రళయ సమయానిలముల దెబ్బలకు నోర్చి,
విలయకాల స్రవంతి క్రోల్లలకు నిలిచి
సృష్టి సంహార వేళాగ్ని శిఖలకొగ్గి
కడకు హతవిధి పాలైతె కల్పవల్లి ॥ ౨

గర్భ నిర్భేద దానవ క్రౌర్యములకు
గంధ నిర్జరగజ కరాఘాతములకు
నచ్చరల గోటిపోటుల యలజడులకు
శాంతిఁజూపి యెటేగితి? కల్పవల్లి ॥ 3

ప్రసవ ముకుళాల రేకులు వదలలేదు
పచ్చికాయలఁ బసిమియుఁ బాయలేదు
క్రొన్ననల కావి రంగును గ్రుంగలేదు
కాలగతిఁ జెందితపుడె, యో కల్పవల్లి ॥ ౪

చిరము నీకూఁత యైన యా సురతరువున
ననఁగి పెనఁగితి విన్నాళ్లలరు చిపుడు
దాని విడిపోవునంత నిర్దయ వహించి
కఠిన మతివైతి వేలమ్మ, కల్పవల్లి ॥ ౫

నీయెడాటమున జేసి నెగులుగదిరి
కంటఁదడి వెట్టుగతి మంచుకణము లురల
నందమెడసిన హరిచంద నావనిజముఁ
గాంచి యూరార్పఁదగునమ్మ కల్పవల్లి ॥ ౬

పలపలమటంచుఁ గన్నీరు చిలికెఁ జిలుక
గోడుగోడున దుఃఖించె గోరువంక
బావురని యెంతొ వాపోయెఁ బరభృతంబు
గనఁగఁజాలక నీపాటుఁ, గల్పవల్లి ॥ ౭

తోడు నీడలుగాఁ జుట్టు దూఁగియాడు
తీవకన్నెల కేమని తెలిపితమ్మ
నీదు పాటున కవి యింక నిల్వఁగలవె ?
కరుణ నోదార్ప రావమ్మ కల్పవల్లి ॥ ౮

మూఁడు తీవలు ముందును మూఁడు వెనుక
నలర నడుమను గలుగు నీయందమెల్లఁ
గాంచి యాయూఱు మది సంతసించుచుండ
క్షణములో వీడి యరిగితె కల్పవల్లి ॥ ౯

ఆఱు తీవలఁ గుసుమఫలాంకురములు
గలుగు టరుదయ్యెఁ, గలిగెఁబో నిలుచు టరుదు,
ఎదియొ, యొక కాయ, యొకదానఁ బొదలనేమి ?
కంటి వీవెల్ల సంపదల్ కల్పవల్లి ॥ ౧౦

పాకశాసనుఁ డత్యంత ప్రాణపదము
గాఁగ, రెండవ శచి గాఁగఁ – గాంచు నిన్ను
నతని దుఃఖాన ముంచి నీ వరుగఁదగునె?
కట్టిడి యెడంద తగదమ్మ, కల్పవల్లి ॥ ౧౧

హరికి సంతానమున కింతయైన లేదు
భేద, మట్లాట నీయందుఁ బ్రియముసూపు
వానికిప్పుడింత వెతఁగూర్చి పాసిపోయి,
కనెదు సౌఖ్యములింపౌనె? కల్పవల్లి ॥ ౧౨

తరులు లతలెన్నొ గలుగు నుద్యానసీమ,
యొక్కతవు నీవు లేమిని నిక్కువముగ
శూన్యముగఁ దోఁచె నిండారు సొంపు బాసెఁ
గలదె నీదర్శనంబింకఁ, గల్పవల్లి ॥ ౧౩

మునులు నినుగారవంబునఁ గనఁగలేదొ?
యచ్చరలు నిన్నుఁ బ్రియమున నరయలేదొ?
సురలు నిను నాదరంబునఁ జూడలేదొ?
కదలితివె? వారి నెడఁబాసి, కల్పవల్లి ॥ ౧౪

ఆశ్రయించినవారికి నభిమతములు
దీర్పఁగలిగిన నీస్థితిఁ దెలిసి వార
లెంత శోకించుచుండిరో యెఱుఁగలేవె?
క్షణములో నేల వ్రాలితె కల్పవల్లి ॥ ౧౫

నేలపై వ్రాలినను గళల్నిలిచియుండె
మెఱుఁగుఁ, బరిమళ మిసుమంత తఱుగకుండె
వికసితలతాంతహాసము విడువకుండెఁ
గడు నదృష్టముగల తల్లి, కల్పవల్లి ॥ ౧౬

హాసన మొనరింపఁదోఁచును నాదిలక్ష్మి,
నిలుచు సమయాలఁగనిపించు నిత్యలక్ష్మి,
పలుకు వేళల నగపడు భాగ్యలక్ష్మి
కతగ మాఱెను నీలీల కల్పవల్లి ॥ ౧౭

భాగ్యరేఖకు నీమోము పట్టుగొమ్మ
సిరికి నీకన్నుఁదామర పురిటి యిల్లు
పుణ్యాకృతులకు నీమేను భోగ సీమ
కలమె నిను మఱువంగ, నో కల్పవల్లి ॥ ౧౮

కనలునను దీవ మేనింత కదలు తెఱఁగుఁ
గుసుమ దరహాస మంతలో విసరు విధము
లలితమధురోక్తులల్లన బలుకురీతిఁ
గలమె మఱువంగఁ, గలనైనఁ గల్పవల్లి ॥ ౧౯

సన్నిహితమైన చిఱుతీవ యున్నిగతుల
సాయమొనరింపఁ గల్పకచ్ఛాయయందుఁ
బ్రసవఫలవృద్ధిఁగని పెక్కువత్సరములు
గడపుదని యెంచి, తిటులాయెఁ గల్పవల్లి ॥ ౨౦

తాల్మి విడియిచ్చు శోకాశ్రు తర్పణమ్ము
సాదరమ్మున నొసఁగు ధర్మోదకమ్ము
గానుకగఁ బ్రీతి నిడిన నక్షత్రమాలఁ
గైకొను, ఋణమ్ము దీఱఁగఁ గల్పవల్లి ॥ ౨౧

స్వర్ణదీజము సంకు పూసల సరంబు
మున్నొసంగిన, దానికే మురిసి తీవు,
పద్య నక్షత్రహార మర్పణ మొనర్తు
నల్ప మనకిది కొనుమమ్మ, కల్పవల్లి ॥ ౨౨

అమరలతవైన నీదు నిర్యాణవార్త
నమ్మెదురె యెవ్వరేని ? యీనాటికిట్లు
జరగు టది కాల విపరీత సరణిగాదె ?
కనుము యాత్మప్రశాంతి నో కల్పవల్లి ॥ ౨౩

ఉన్న యన్నాళ్లు నెల్ల 'రోహహో' యనంగ
నుంటి, వుపకారములె సేయఁగంటి, కీర్తిఁ
గొంటి, వైభవమున మంటి, కొఱఁతలేక,
కడకు దురదృష్టులము మేమె కల్పవల్లి ॥ ౨౪

మనసు నిల్వక మమతమై పనవి పనవి
యలయుటయె కాని, స్థిరము నీయాత్మయెపుడు
నాపరాత్పరుతో నైక్యమంది, విబుధ
గణ్య కల్యాణములఁ గాంచుఁ గల్పవల్లి ॥ ౨౫

నీదుమూలమునన గల్గి నిన్నుఁజుట్టి
ప్రాఁకనేర్చిన మొలకలు క్రమముగాఁగ
సర్వతోముఖవృద్ధియు సద్యశంబుఁ
గాల జెలువొందు హరికృపఁ గల్పవల్లి ॥ ౨౬

భౌతిక లతా స్వరూపము భస్మమైన
శాశ్వతంబైన నీయాత్మ సమయకెపుడు
లక్ష్మియై హరివక్ష మలంకరించి
కాంతు లీనుచు వెలుఁగుత కల్పవల్లి ॥ ౨౭

కల్ప తరువు.

నీదు చితియాఱెనో లేదో, నీదు నాత్మ
స్వర్గమును జేరెనో లేదో, త్వద్వియోగ
చింత వేపఁగ నెంతయుఁ జివికి చివికి
కల్పతరువును నినుఁగూడెఁ గల్పవల్లి ॥ ౨౮

ప్రియసమాశ్లేష సౌఖ్యము వీడియుండ
వొక్కక్షణమేనిఁ, గాన నీ వొక్కయేటి
లోననే వేల్పుమ్రాని నీలోన నకట,
కలిపికొంటివి, సాధ్వివి, కల్పవల్లి ॥ ౨౯

నందనారామ వీథి నానంద లహరి
నోలలాడుచు నెలమిఁగల్పోర్విరుహముఁ
గూడి, సతము వియన్నదీ కూలమందుఁ
గడపుమా యాత్మ శాంతి, నో కల్పవల్లి ॥ ౩౦

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## 31. 'మిల్టన్' భార్య గయ్యాళి.

(ఒకమిత్రుఁడు మిల్టనుతో) :—

'ఓయి, లావణ్యములదీవియైన యెసంగు
నీదు సతియెఱ్ఱని గులాబి నీటునవ్వ'

(మిల్టను అతనితో) :—

'అరరె! మురిసెదు గులాబి యంగుఁజూచి
యదిగో! ప్రక్కనె ముండ్లుండుటరయలేవె? ॥ ౧౨

—:0:—

## 32. డాక్టరు టాగూరుగారి చరమగీతము (1942)

## "మరణము"

కంటి, శోకాంధకారయుక్కాళరాత్రి,
విపుల బాధల బొమముడిన్, వివృతమైన
యంగవిన్యాసమును, దనయాయుధములు
గాఁగఁ, బలుమఱు నాయింటి గడపఁద్రొక్క ॥

దిగులు గొల్పెడు దానికృత్రిమపువేష,
మేను, నమ్మినయపుడెల్లఁ, దాను దనదు
'కపటనాటకమున కుపక్రమముసేయ
యత్న మొనరించుఁ జీఁకటు లలమినపుడ ॥

కాని ఫలమంద, కపజయ కలితయయ్యొ,
ఈ జయాపజయ క్రీడలెల్ల, జీవి
తంపు విభ్రమములు, చిన్నతనమునుండి
ప్రతిపదంబిట్టి యమదండ భయముగలదు

ఆర్తిదేవత వికటాట్టహాస భరిత
యగుచుఁ బలువిధభయదకార్యములఁ, బ్రౌఢ
మైన మృత్యుకల్పితము, మహాయవనిక
చెదరిపోయెడు చీఁకట్లఁ గదలుచుండె ॥

(మాతృసేవ 23-8-52).

---

# Dr. Tagore's Last Poem (1942)

## "DEATH"

Sarrow's dark night again and again,
Has come to my door,
Its only weapon, I saw,
Was pains twisted brow, fears hideous gestures,
Preluding its deception in darkness,
Where-ever I have believed in its mask of dread,
Fruitless defeat and victory is life's delusion,
From childhood, at each
Step clings this sceptre,
Filled with sorrow's mockery,
A moving screen of varied fears,
Death's skilfull hand work wrought in scattered gloom.

### 33. పరదాస్యము.

తిరుమల మందిరా! నిను హృ
దిన్నెలకొల్పి సమంచితార్చనా
పరత మెలంగుటం గలుగు
భాగ్యము, నాకెటులబ్బునో?, నిరం
తరపరదాస్య శృంఖలలఁ
దద్దయుఁ జిక్కి, యహర్నిశంబు, లా
తురపడు చాత్మరక్షణము
దొడ్డగనెంచెడు స్వాభిమానికిన్ ॥ ౧

తిరుమలేశ! నిన్ను నరగడె యేనియుఁ
దలఁపఁ దీరికీని పలువకొలువు
జ్ఞానమిథునకర్మసరణిఁ దటస్థింపఁ
జేసినావు, నన్నుఁ జెడిపినావు ॥ ౨

పూర్వజన్మకృతము పుడమిఁగట్టి కుడుపు
ననుట నిజమయేని స్వానుభవముఁ
బట్టి, యెంతయఘముఁ బచరించియుంటినో
యెఱుఁగుకొలఁదిఁ దాల్మి తఱిగె శ్రీశ! ॥ 3

### 34. నైరాశ్యము.

అరరే! కరుణానిధివని
పరమమునీంద్రులు వచించు పల్కులు మదిలోఁ
దిరముగ నమ్మితిఁ, గొలిచితి
వెలివిడినై చెడితిఁ జెడితి వేంకటరమణా! ॥ ౪

నిజమా గజేంద్రమోక్షము ?
నిజమా ప్రహ్లాదచరిత ? నిజమా, ద్రుపదా
త్మజఁగాచిన కత, సాధు
ప్రజ నమ్మంజేసె దీయబద్ధోక్తులచేఁ ॥ ౫

పుక్కిటి పురాణములెగా
కక్కట! రామాయణాదు లగునా నిజముల్ ?
మక్కువ! నీపైఁగలవా,
రక్కతలం గలఁచి రెదల నఖిలప్రజకుఁ ॥ ౬

నీవే కులదైవంబని
భావించి భజించు భక్తవర్యులకు సిరుల్
వావిరి నిడుదువటందురు
గా, విబుధులు ; గలదె తారకాణ మొకింతేఁ ॥ ౭

దారులఁ గొట్టి హరించెడు
నేరుపుగలనీవు, భక్తనికరము కడనేఁ
గోరుదు వర్థముఁగైకొన
నౌరా! యిట్టేఁడవు సిరుల నర్థులకిడు దే ? ౮

35. పాపశంక.

మానవ మానసంబు నను
మానపుఁడెంకిగఁ బాపశంకిగాఁ
బూనివచింతు రార్యు లది
బూటకమెట్లగు ? ; దుర్వికల్పనా

ధీనతఁ జెడ్డ యోచనలె
దేరకొనర్పుఁ; దలంప దోక్కయిం
తేని శుభంబు; నిట్టి మన
సేల సృజించితో వేంకటేశ్వరా? ॥ ౯

36. జీవితనౌక.

సంస్కృతివారిరాశి యగు
చోట్లకుఁ దావల, మందు దిట్టయై
శంసితవృత్తి నెవ్వఁడు వె
సం దనజీవితనౌక నీడ్చు, ను
త్తంసుఁడు వాఁడె మానవుల,
దైవసహాయము వానికే యగుఁ
ధ్వంసముగాని యాత్మబల
భాగ్యము వానికగుఁ రమాపతీ! ॥ ౧౦

శ్రమల తుపానులం గదలి
స్వాంతము, పైఁబడు నాపదంతరీ
పములకుఁ దాఁకి, బంధుజన
వర్గతిమింగిలపాళిదంష్ట్రిలఁ
నములఁగఁబడ్డ జీవితపు
నౌక, భవాంబుధి తీరమంది, నీ
యమల పదాబ్జముల్గనఁగ
నారట మందెడు వేంకటేశ్వరా! ॥ ౧౧

కష్టజీవితనావ చుక్కాని లేక
తూలుచు భవాబ్ధిసాగుచోఁ దుట్టతుదకు
చందనావ్యాజమునఁ జూపినావు, నాకుఁ
గరుణ నాలంబనంబొందుఁ దిరుమలేశ ! ॥ ౧౨

37. విన్నపము.

స్వామీ ! వేంకటశైలరాడ్భవన ! నీ
బ్రహ్మోత్స వానందమే
ప్రాముఖ్యంబుగఁ జూచుకొంచుఁ గడుపా
రన్మొక్కి, పద్మావతీ
భామాలీలలఁ జొక్కి, భూషితుఁడవై
పల్మాఱు నూరేఁగు చెం
తే మోదంబుననిక్కి యన్యవిషయం
బే యెన్నవేమీ ? ప్రభూ ! ॥ ౧౩

కొలిచిన నిన్నె కొల్వవలెఁ
గూటికివాఁచిన బక్కదేవరల్
నిలువఁగ నీడలేక యిగి
లించెడు దేవర, లామిషార్థులై
మెలఁగు కరాళదేవరలు
మేదిని నీకెటుతుల్యు లట్టివా
రలదరిఁ జేరివేఁడినఁ గొ
అంతల నార్తురో ? తీర్తురో ? ప్రభూ ॥ ౧౪

' ఆపదలయందు ' మ్రొక్కు ' యటంచు నాదు
పాదములు పట్టుకొందు, సంపదలయందు

నేనుజ్ఞప్తికి రానేమొ? నీకు, జడుఁడ!'
యంచువిడుతువో, ననుఁగావ, కద్రినిలయ! ॥ ౧౫

నీవు విడిచిన, విడుతునే నిన్ను నేను,
దల్లివెనుకొను నిసుఁగువిధాన నిన్ను
వెంబడింతు, మన్నింపఁగ వేఁడికొందు
నీవెదిక్కందుఁ గరుణించి కావుమందు ॥ ౧౬

అండను నీవు మెలంగుటఁ
గొండలవలె వచ్చిపడెడు ఘోరాపదలుం
బెండులవలెఁ దేలిచనుఁ
నిండుముదంబిచ్చు మదికి నీళారమణా! ॥ ౧౭

దేవా! చేసినసేవకుఁ ఫలము నెం
తేనిచ్చి, భక్తావళిఁ
గావంజూతువు, సత్కృపాపరుఁడవై,
కాసంత నీపై ఋణం
బేవంకం బడనీవు, నీప్రతిభ వ
ర్ణింపంగ శక్యంబుగా
దావాణీ పతికైన, నాకెటులు సా
ధ్యంబౌను గించిజ్ఞుఁడన్ ॥ ౧౮

నరు లెఱుఁగఁగలరె? నీదగు
పరతత్త్వరహస్యమెన్ని భంగులనేనిన్
వరనిష్ఠఁ దలివియున్నను,
దిరుమలపతి! నిన్నె నమ్మితిం దయఁగనుమా! ౧౯

నానావస్తువులందును
నానారూపముల వెలసి నానాగతులన్
నానాఁడు నాట్యమాడెదు
నానాథా! వేంకటేశ! నతులను గొనుమా!॥ ౨౦

౨౭. వేఁడికోలు.

గంగా తోయములందు, ము
నుంగుట ; భారతచరిత్రను వినుటయు, స్నీ
లాంగుని చరణంబులఁ గొ
ల్వంగాంచుట కల్పశతకముల న్నాకగుతన్ !॥ ౨౧

శమదమాద్యత్యంత సద్గుణసదనమౌ
బ్రాహ్మణవంశానఁ బ్రభవమంది,
రాజాధిరాజ సంపూజిత వేదగో
త్ర ప్రథమాంధ్ర సత్కవిగ వెలసి,
యోగ్యతా యోగ్యతలొగి విమర్శించెడు
విజ్ఞానయుతుఁడనఁ బేర్మిఁగాంచి,
దేశాభ్యుదయకార్య దీక్షవహించి స
త్కృతులెన్ని యొసల్పి యెలమినలరి
బ్రదికితిని నీకరుణనింతవఱకు నెట్లొ,
భావియిఁక 'వినాదైన్యేన జీవిత' మ్మ
నఁగ, 'ననాయాసమరణ' మ్మనఁగసుఖాన
మనికిసాగ, ననుగ్రహింపఁగదె, శ్రీశ!॥ ౨౨

—:0:—

# తేనెసోనలు గూర్చిన కొన్ని అభిప్రాయములు

చిత్కళికాగనిమూలమగు - శ్రీపతిపాదయుగం భజించి, వి
ద్వత్కవిభూషణున్మధుర - భాషణు వేంకటకృష్ణశర్మ, న
త్యుత్కటభక్తినెంచి విబు - ధోత్తములన్వలపింపఁబంపె, నీ
సత్కవి నాగనార్యుఁడు వి - శాలరసప్రచురోపహారముల్ ||

కమ్మని జుంటితేనెపయిఁ - గ్రమ్మి, కరమ్మగఁ జిమ్ము భృంగరా
జమ్ము మృదుస్వరమ్ము, తెల - జవ్వని మవ్వపుమోవి తేనెపా
కమ్ములుఁ, గప్రపుంబలుకు - ఘుమ్మను తావుల తావు, లబ్జగం
ధమ్ముల నిమ్ములౌ భవదు - దారకృతుల్ రసవత్కృతుల్ గురూ !||

తెలుఁగుఁదనమ్ముతోఁ దెలుఁగుఁ - దేట తెలుంగువెలుంగు నల్వలం
కల వెలిఁగించి తెల్గుపలు - కుల్వినిపించి, తెలుంగు పేరు పెం
పులఁ దులకించి, క్రొందెలుఁగు పోహణులన్ జిలికించి, తెల్గుజా
తులఁ దలపించి మించితివి - తోల్కరివానలఁ దేనెసోనలన్ ||

ఒడుదుడుకులేని నడవడి,-గడుసరి తెగఁదెంపు సొంపుకైతలు, బలుపో
కడఁబోని యొసఁదనిలుకడ,-కడమకవీశ్వరులఁ జూడఁగా లేదయ్యా

నిద్రాణంబగు నాంధ్రజాతి మతులన్ - నిర్నిద్రజాగ్రద్విధా
భద్రప్రక్రియలాచరించుటకు, నీ - ప్రజ్ఞానబోధమ్ము ల
త్సుద్రమ్ముల్గద ! తద్రహస్యములు, నీ - క్రొంగైతలే సర్వతో
భద్రంబుల్వెలయించి మించు, బహుధా - ప్రాశస్త్యనిస్తుల్యమై ||

జే యనిపించినావు కవి - శేఖరులెల్లరు సన్నుతింప, నా
హా యనిపించినావు మహి - తాంధ్రకృతుల్ విరచించి, బోధలా
రా యనిపించినావు బుధు - లందఱు మెచ్చఁగ విద్యచెప్పి, సై
సై యనిపించినావు నిజ - జాతిసమున్నతిఁ జూపి, సద్గురూ ||

కంగారెత్తిన రాజకీయముల పో - కల్ సూచి, తెల్గుందనం
బంగారం బిడినట్టులయ్యెనని శో - కావేగచిత్తోన్నతిం
బంగారట్టి నిజాంధ్రజీవితము ని - ల్పంబూని బోధించు నీ
యుంగుల్ రంగులకుంచె వన్నెలిడున - య్యా ! నూటికిం గోటికిన్ |

(వైద్యవిద్వాన్ — సత్కవి) నాదు నాగనార్య.

వేదము వేంకటకృష్ణ మ - హోదయులు రచించిపట్టి యుద్గ్రంథములన్
సాదరముగఁ బఠియించి ప్ర - మోదముఁ గనినట్టివాఁడు
పుణ్యాత్ముఁడేయా ॥

'తేనెసోనలు' — త్రావియుంటిని, - దీపించే మదమెక్కియుంటిని,
అనఁగాంచితి నమృతధారల, - నతిసుఖంబది యందఁగంటిని,
నేన, నీవనునట్లు కైతను - నెగడఁజేసెడి ప్రోఢ యీతఁడు
కాన, నీతని కావ్యమధువును, - గాంచి క్రాలుత మాంధ్రలోకము ॥

సలలితమైన శబ్దములు, - చక్కనిభావములుం, బ్రియోక్తులున్,
నెలకొనియుంట సొంపెసఁగి - నిస్తులమై తగునట్టి "తేనెసో
నలు" గడుఁగూర్చె సమ్ముదము; - నవ్య కవిత్వము, పూతభావశో
భలు గులుకంగ నాంధ్రభువి - వర్తిలుఁగాక చిరంతనంబుగన్ ॥

బులుసు వేంకటేశ్వరులు (బి.ఏ.)

ఆంధ్రసారస్వతము నేఁడొకవంక, వెఱ్ఱితలలు వైచుచున్నను, వేఱొక దెస, నసమాన సౌందర్యసంపదతో రాణించుచున్నది. ఈసౌందర్యము సంస్కారసంపన్నులు, శిష్టులు నైన కవిశేఖరులు చేకూర్చి పెట్టునది. ఇట్టి ఉత్తమకవులలో శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారొకరు. వీరి 'తేనెసోనలు' అనుఖండకావ్యసంపుటము అన్వర్థ నామధేయము. నేఁటి ప్రజాసమస్యలను గూర్చి అభివర్ణించిన కవితాఖండము లిందు పెక్కులున్నవి. ముఖ్యముగా మనరాష్ట్రసమస్యనుగూర్చి శర్మగారింత ఆవేదనపడుట, ఇన్ని పద్యములు— పాటలు వ్రాయుట సంస్తవనీయము. వీరిపలుకు సుసంస్కృతమై ప్రాచీన కవీంద్రులను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఉభయభాషాసముద్రముల నీఁదిన వేదమువారివాక్కు సజీవముగా, సాధువుగా, ప్రౌఢముగా నుంటలో వింత యేమి ?—"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

తుమ్మల సీతారామమూర్తి చౌదరి.
(అభినవ తిక్కన)

విద్వత్కవివతంసమా,—

"తేనెసోనలు"— నిక్కముగా తేనెసోనలు. అందు ముఖ్యముగ నన్నాకర్షించినవి "శ్రీపతి"— యను శీర్షికఁగల పంచరత్నములు. అందలి

భావములన్నియు నాయవియే.... నాయెడఁదనుండి వాని నెట్లు హరించితిరి ?—"రవిగాననిచోఁ గవిగాంచునేకదా ?"— యందురా ?

తమయుత్సాహము నిరుపమానము. తమభాషాసేవ అద్వితీయము. తమకవిత్వగౌరవము అనన్యసాధారణము. తాము నిరంతరము కావ్యకుసుమములతో భాషాయోషను గైసేయుచునే యున్నారు. ఇన్ని వ్రాఁతలకు— ఇన్ని కావ్యకుసుమరచనలకు— అవకాశము తమ కెప్పు డెట్లు లభించుచున్నదో ? దురూహ్యముగ నున్నది.

తమయట్టి సారస్వతోపాసకులను— విద్వత్కవివరేణ్యులను ప్రోత్సహింపని— పోషింపని సంఘమున్ననేమి ? లేకున్ననేమి ?— ఏది యెట్లైన నుండుఁగాక !— 'శ్రీపతి' పఠనమునఁ గలిగిన యానందపారవశ్యమున— నీలేఖతోఁబాటు పంపుకొన్న నాచిన్నియుడుగర స్వీకరించి—ననుఁ గృతార్థునొనర్పఁ బ్రార్థించుచున్నాఁడ.

విధేయుడు :—(విద్వాన్) మంకాల శ్రీపతిశాస్త్రి, బి. ఏ.

"Poetry is the music of thought conveyed to us in the music of language"—

అని పాశ్చాత్య లాక్షణికులును, "చమత్కారజనక భావనావిషయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్"— అని ప్రాచ్యలాక్షణికులును,—కవితను గూర్చి చెప్పిన నిర్వచనమునకు— శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారి 'తేనెసోనల'—లోని యొక్కొక్క ఖండకావ్యమును లక్ష్యము కాఁగలదిగా నున్నదనుట కెట్టిసందియమును లేదు.

శ్రీశర్మగారు గీర్వాణాంధ్రములందేకాక, యాంగ్లముననను మంచి ప్రవేశముఁ గలవారగుటచే—నటు ప్రాచీనకవుల సంప్రదాయముల ననుసరించుచు,—నిటు నవ్యకవుల భావనాపథములలోఁ విహరించుచు— హృదయంగమములు, సలక్షణములు, సరళములు నగు శబ్దజాలములతో 'తేనెసోనల'ను సంతరించినారు. నాచదివిన యీపొత్తములు రెండుసంపుటములలోఁ గల ప్రతిపద్యమును అందుల కుదాహరణము గాఁదగును.

మదరాసు, విజయ, శ్రావణము } అష్టావధాని : విద్వాన్ అం. సుబ్బరాయగుప్త, M.A., B.Ed., B.O.L.

మహాశయా ! నమస్కారములు.

నేను మీకు పరిచితుఁడ నైనను, మీరు నాకు పరిచితులైనవారే. అందులో మీరు 'రాయలసీమ'— వాసులగుట మాయదృష్టము. మీ 'తేనెసోన' లిటీవల ఒకటిరెండు కణములనుమాత్రమే చవి చూడఁగల్గితిని. అందులో "రాయలసీమ"ను గూర్చిన పద్యములమూల్యరత్నములు.

అనంతపురము
24—4—1953 } కస్తూరి అహోబలరావు.

తేనెసోనలు మొదటిసంపుటము ; రెండవసంపుటము.

ఇవి రెండూ రచయిత అప్పుడప్పుడు రచించిన ఖండకావ్యసంకలనాలు. వీటిలో మొదటిదానికి శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు, రెండవదానికి శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు ప్రవేశికలు రచించారు.

రచయిత ఈకాలంలో బాగా ప్రచారంలో ఉన్న ఖండకావ్యరచనా పద్ధతి ననుసరించి ఈరెండు సంపుటాలలోను, చిన్నచిన్న కథాకావ్యాలు, ప్రకృతివర్ణనలు, చాటువులు, అనువాదకావ్యాలు, భావచిత్రణలు మొదలైనవన్నీ సమకూర్చారు.

వీరిరచనలో సాంప్రదాయకచ్ఛందస్సులే గాక వినూతనఫణితిలో రచించిన గేయచ్ఛందస్సులుకూడా ఉన్నాయి.

వీరికవిత అంతటా భాషాసాంప్రదాయికమైన శిష్టమార్గంలో నిర్దుష్టంగా సాగిపోతుంది. ('భారతి'—విజయ : శ్రావణము) 1953 : ఆగస్టు.

ఇందలి యొక్కొక్క పద్యఖండము పులఖండముం బోలియాస్వాదరమ్యంబై యున్నది. వీరి సునిశిత శృంగారరచనములును ప్రశంసాపాత్రములు. విరహోత్కంఠితాది నాయికాలక్షణములు నిరూపించు పద్యములలో రసాభాసముదోఁపనీయమి వీరి కవితాసామర్థ్యమున కొక తార్కాణము.

—స్వతంత్ర (22 మే, 1953)

శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు పీఠికలో చెప్పినట్లు "వీరికి పద్యము చెప్పుటలో నెంతటి ప్రజ్ఞయున్నదో గేయములు రచించుటలోను నంతటినిరూఢనైపుణ్యమున్నది.—ఇందలి ప్రతిపద్యమును రసభావబంధురమై మనస్సును రంజింపఁజేయుచున్నది"—ఆంధ్రప్రభ (10-5-1953)

భావములన్నియు నాయవియే.... నాయెడఁదనుండి వాని నెట్లు హరించి తిరి ?—"కవిగాననిచోఁ గవిగాంచునేకదా ?"— యందురా ?

తమయుత్సాహము నిరుపమానము. తమభాషానేవ అద్వితీయము. తమకవిత్వగౌరవము అనన్యసాధారణము. తాము నిరంతరము కావ్యకుసుమములతో భాషాయోషను సైసేయుచునే యున్నారు. ఇన్ని వ్రాఁతలకు—ఇన్ని కావ్యకుసుమరచనలకు— అవకాశము తమ కెప్పు డెట్లు లభించుచున్నదో ? దురూహ్యముగ నున్నది.

తమయట్టి సారస్వతోపాసకులను— విద్వత్కవివరేణ్యులను ప్రోత్సహింపని— పోషింపని సంఘమున్న నేమి ? లేకున్న నేమి ?— ఏది యెట్లైన నుండుఁగాక !— 'శ్రీపతి' పఠనమునఁ గలిగిన యానందపారవశ్యమున— నీలేఖతోఁబాటు పంపుకొన్న నాచిన్నియుడుగర స్వీకరించి—ననుఁ గృతార్థు నొనర్పఁ బ్రార్థించుచున్నాఁడ.

విధేయుడు :—(విద్వాన్) మంకాల శ్రీపతిశాస్త్రి, బి. ఏ.

"Poetry is the music of thought conveyed to us in the music of language"—

అని పాశ్చాత్య లాక్షణికులును, "చమత్కారజనక భావనావిషయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్"— అని ప్రాచ్యలాక్షణికులును,—కవితను గూర్చి చెప్పిన నిర్వచనమునకు— శ్రీవేదము వేంకటకృష్ణశర్మగారి 'తేనెసోనల'—లోని యొక్కొక్క ఖండకావ్యమును లక్ష్యము కాఁగలదిగా నున్నదనుట కెట్టిసందియమును లేదు.

శ్రీశర్మగారు గీర్వాణాంధ్రములందేకాక, యాంగ్లమునను మంచి ప్రవేశముఁ గలవారగుటచే—నటు ప్రాచీనకవుల సంప్రదాయముల ననుసరించుచు,—నిటు నవ్యకవుల భావనాపథములలో విహరించుచు— హృదయంగమములు, సలక్షణములు, సరళములు నగు శబ్దజాలములతో 'తేనెసోనల'ను సంతరించినారు. నాచదివిన యీహొత్తములు రెండుసంపుటములలోఁ గల ప్రతిపద్యమును అందుల కుదాహరణము గాఁదగును.

మదరాసు, విజయ, శ్రావణము

అష్టావధాని : విద్వాన్
అం. సుబ్బరాయగుప్త, M.A., B.Ed., B.O.L.

మహాశయా ! నమస్కారములు.

నేను మీకు పరిచితుఁడనైనను, మీరు నాకు పరిచితులైనవారే. అందులో మీరు 'రాయలసీమ'— వాసులగుట మా యదృష్టము. మీ 'తేనెసోన' లిటీవల ఒకటిరెండు కణములనుమాత్రమే చవి చూడఁగల్గితిని. అందులో "రాయలసీమ"ను గూర్చిన పద్యములమూల్యరత్నములు.

అనంతపురము
24—4—1953 } కల్లూరి అహోబలరావు.

తేనెసోనలు మొదటిసంపుటము ; రెండవసంపుటము.

ఇవి రెండూ రచయిత అప్పుడప్పుడు రచించిన ఖండకావ్యసంకలనాలు. వీటిలో మొదటిదానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, రెండవదానికి శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు ప్రవేశికలు రచించారు.

రచయిత ఈకాలంలో బాగా ప్రచారంలో ఉన్న ఖండకావ్యరచనాపద్ధతి ననుసరించి ఈ రెండు సంపుటాలలోను, చిన్నచిన్న కథాకావ్యాలు, ప్రకృతివర్ణనలు, చాటువులు, అనువాదకావ్యాలు, భావచిత్రణలు మొదలైనవన్నీ సమకూర్చారు.

వీరిరచనలో సాంప్రదాయకచ్ఛందస్సులే గాక వినూతనఫణితిలో రచించిన గేయచ్ఛందస్సులుకూడా ఉన్నాయి.

వీరికవిత అంతటా భాషాసాంప్రదాయికమైన శిష్టమార్గంలో నిర్దుష్టంగా సాగిపోతుంది. ('భారతి'—విజయ : శ్రావణము) 1953 : ఆగస్టు.

ఇందలి యొక్కొక్క పద్యఖండము పులఖండముం బోలియాస్వాదరమ్యంబై యున్నది. వీరి సునిశిత శృంగారరచనములును ప్రశంసాపాత్రములు. విరహోత్కంఠితాది నాయికాలక్షణములు నిరూపించు పద్యములలో రసాభాసము గోపనీయమై వీరి కవితాసామర్థ్యమున కొక తార్కాణము.

— స్వతంత్ర (22 మే, 1953)

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పీఠికలో చెప్పినట్లు "వీరికి పద్యములు చెప్పటలో నెంతటి ప్రజ్ఞయున్నదో గేయములు రచించుటలోను నంతటినిరూఢనైపుణ్యమున్నది.—ఇందలి ప్రతిపద్యమును రసభావబంధురమై మనస్సును రంజింపఁజేయుచున్నది"—ఆంధ్రప్రభ (10-5-1953)